# అపారమైన శక్తియుత్సాహములే మీ ప్రతిష్ఠను కాపాడగలవు

# అమృత

## మధురమైన పానీయము

వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికీ అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాటిది.



## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్ కు, తమిళ నాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

# నా విధి నేను నెరవేర్చాను



ఆ వూరి ఆస్పత్రిలో నేను డాక్టర్ని. వెంకన్న కొడుక్కి జబ్బుచేసిన ఆ రోజు నే నెప్పటికీ మర్చిపోలేను. కుర్రాడి పరిస్థితి చూస్తే చాలా తీవ్రంగావుంది. నాదగ్గర కావలసిన సాధనా లేమీ లేవు. ఏం చేయగలను? కాని ఎలాగో దేవుడిదయవల్ల జబ్బు నయమయ్యి కుర్రాడికి నెమ్మళించింది. దగ్గరలో డాక్టరు వుండేగల సౌకర్య మేమిటో ఆవాళ వెంకన్నకి తెలిసొచ్చింది. నేనుచేసిన కొద్ది వైద్యసహాయానికే అతను ఎంతో కృతజ్ఞత తెలియ జేశాడు. ఆమాత్రం వైద్యసహాయమూ కూడా దొరకక సాటివారు ఎల్లా అవస్థలు పడుతున్నారో, మనం డబ్బు పొదుపు చేసుకొన్నందువల్ల వారుకూడా ఎల్లా సుఖపడగలరో అతనికి చెప్పాను. అంతే – రూపాయిలు నింపిన ఓ కుండని ఆ సాయంత్రం అతను నా దగ్గరికి తెచ్చాడు. ఎంతో ఆశ్చర్యమయింది. ఆ విలువకు జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లు తనకు కొనిపెట్టమన్నాడు! నాకు పట్టరాని సంతోషం కలిగింది. ఆవేళ నా విధి నేను నెరవేర్చినట్టు భావించాను.

మీ పొదుపు ధనం జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లలో గాని, ఇతర పొదుపు ఉద్యమ సెక్యూరిటీలలో గాని పెట్టుబడి పెడితే ప్రభుత్వం హామీ ఉంటుంది. పన్నులు లేకుండా వడ్డీ కిడుతుంది. అంతేకాకుండా ఆస్పత్రులు, స్కూళ్లు, రోడ్లు, కాలవలు, విద్యుచ్ఛక్తి మొదలైన సౌకర్యాలు విస్తరింపజేసే అంశాలుగల జాతీయాభివృద్ధి కార్యక్రమాల అమలుకు అవసరమయ్యే సహాయం చేస్తున్న సంతృప్తి కూడా మీకు లభిసుంది.

**12- ఏళ్ల జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లు**

* పన్నులు లేకుండా సాలీనా 5.41% వడ్డీ
* రూ 5 మొదలు రు 5,000 వరకు వివిధ విలువల్లో ప్రతి పోస్టాఫీసులోనూ లభ్య మవుతాయి.
* ప్రభుత్వం హామీ ఇచ్చినవి

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం తాలూకు ఇతర ప్రభుత్వ సెక్యూరిటీలు :

10-ఏళ్ల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికేట్లు

పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు డిపాజిట్లు




DA 57/308 TG



## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

ఇతర వివరాలకు: నాగపూరులోని నేషనల్ సేవింగ్సు కమీషనరుకు గాని, మీ రాష్ట్రానికి సంబంధించిన రీజినల్ సేవింగ్సు ఆఫీసరుకు గాని వ్రాయండి

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యస్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
ఏర్పడిన పవిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] మే 1958 [సంచిక ౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50, న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25, అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను.

రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.



మైమరపించే కుసుమ సౌరభము




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## డాక్టరు ధోండే కేశవ్ కార్వేకు ఘన సన్మానము

101 జన్మదినోత్సవ సందర్భమున 100 వేళ్లు నిండిన మహర్షి డాక్టరు కార్వేకు బొంబాయిలో ఘనమైన సన్మానము జరిగిన సందర్భమున (ప్రధాని పండితనెహూ) ప్రధాన అతిథిగా పాల్గొని దేశాభ్యుదయానికి ప్రధానమైన స్త్రీ విద్యావ్యాప్తికి, వారి అభ్యుదయ సౌభాగ్యాలకు, గ్రామీణప్రాంతాలలో విద్యా ప్రచారమునకు చేసిన కృషిని ప్రశంసించిరి.

సుప్రసిద్ధ విద్యావేత్తగా, నిర్మాణ కార్యకర్తగా, సంఘసేవాపరాయణుడుగా మహర్షి కార్వేను గుర్తించి ఆయనకు 91-వ ఏట లక్షరూపాయలనిధి సమర్పించబడినది. భారత ప్రభుత్వము 1955లో పద్మవిభూషణ బిరుదమును, 1958 సం॥లో భారతరత్న బిరుదమును వారికిచ్చి ఘనంగా సన్మానించింది.

డాక్టరు కార్వేయొక్క స్వార్థరహితమైనసేవ, ధైర్యసాహసాలు, ప్రజాహితముపట్ల ఆసక్తి తరతరాలు మనలను ప్రోత్సహించి ముందుకు నడుపాలనియు, ఆయనకు శాశ్వత చిహ్నంగా నెలకొల్పబడిన యస్. యన్. డి. టి. మహిళా విశ్వవిద్యాలయము (కార్వేయూనివర్సిటీ) కలకాలము వర్ధిల్లాలని ఆశిస్తూ, మహర్షి కార్వేకి భగవంతుడు ఆయురారోగ్యాలను ప్రసాదించుగాకయని ప్రార్థించుచున్నాము.

—(o)—

# చలనచిత్ర నిర్మాణము

ఉత్తమచిత్రాల బహుమతి ప్రదానోత్సవ సభలో రాష్ట్రపతి డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ప్రబోధాత్మక చిత్రాల నిర్మాణం జరుగాలని ఉద్బోధించారు.

భారతీయ చిత్ర పరిశ్రమ దినదినాభివృద్ధిగాంచుచుండుట, చిత్రాల ప్రమాణము క్రమంగా అభివృద్ధి దశలోనుండి విదేశాలలో సయితము ప్రశంసలనందుకొనుచుండుట ఆనందించవలసిన విషయము.

చలనచిత్ర నిర్మాణము ప్రజల అభిరుచులననుసరించి వినోదవిలాసములను కల్పించుటయేకాక విద్యావిజ్ఞానముల వ్యాప్తికి, సాంఘిక అభ్యుదయము, నైతిక, ఆర్థికస్థాయి ప్రబోధమునకు వినియోగపడాలి. ఈ సందర్భమున నిర్మాతలు, దర్శకులు డబ్బు గడించుటయే ప్రధానముగా నెంచక జాతీయశ్రేయోపురోభివృద్ధులకు వినియోగపడే చిత్రాల నిర్మాణమునకు పూనుకోవాలి. ఆప్రయత్నములో ఎదుర్కోవలసి రాగలఒడిదుడుకులనుండి తప్పించుటకు ప్రభుత్వము సహాయపడవలసియున్నది.

ఉన్నత, ఉత్తమ ఆదర్శలక్ష్యాలతో ఉత్తమోత్తమ కళాఖండాలను నిర్మిస్తున్న దర్శకులు, నిర్మాతలు శ్రీ శాంతారాం, శ్రీ B.N రెడ్డి, శ్రీమతి కన్నన్ దేవి లాంటివారు అభినందనీయులు.

పిల్లలతోపాటు తల్లి దండ్రులకుకూడ విజ్ఞానం బోధిస్తున్న

# ఆదర్శ ఉపాధ్యాయిని



అయోవా రాష్ట్రంలోని ఎమాన్‌లో ఎడ్వర్డ్స్ పాఠశాల ఉంది. దానిలో సెకండ్ గ్రేడ్ తరగతిని మిస్ జీన్ లిస్టర్ బార్జర్ నిర్వహిస్తోంది. ఆ తరగతిలో చదువుకొంటున్న బాల బాలికల అభ్యుదయం వారి తలితండ్రులు తెలుసుకొంటూ ఉండేటందుకు ఆమె ఒక చక్కని ఉపాయం కనిపెట్టింది. అది ఏమిటంటే. ఆ బాల బాలికల తలిదండ్రులను తరచు సమావేశ పరుస్తూ, వారివారి చిన్నారి పాపలు ఎలా అభివృద్ధి చెందుతున్నారో వివరించి చెబుతుంది. అంతేకాకుండా ఆ సమావేశం మూలంగా ఆ పాఠశాల విధానాలు, మొదలైన విషయాలగురించి వారు ప్రశ్నించేటందుకు అవకాశం కల్పిస్తుంది.

1958 సంవత్సరానికి నేషనల్ టీచర్‌గా ఆమెను మాక్‌కాల్స్ పత్రిక ఎన్నుకొంది. ఆమె వినియోగించే విధానాలు తెలుసుకోవటానికి ఎంతో ఉత్సాహకరంగా ఉంటుంది. ఉదాహరణకు ఒక్క విషయం ఇక్కడ సూచిస్తాను. తన తరగతిలో 27 మందికి ఆమె స్పానిష్ భాష నేర్పుతుంది. విద్యార్థి తెలివితేటలు అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో వారివారి కుటుంబాలవారితో చాలా సన్నిహితంగా చేరి పనిచేస్తుంది. తరగతిలో మెరికలైన సీనియర్ విద్యార్థులచేత క్లిష్టమైన పనులు చేయిస్తుంది. తెలివితేటలు తక్కువైనవారికి, పాఠశాలసమయం దాటిన తర్వాతకూడా, కడుఓర్పుతో పాఠాలు నేర్పుతుంది. అలా చేయటంవల్ల కలిగిన సత్ఫలితాలు ఆశ్చర్యాన్ని కలిగించినవి. ఆమె సెకండ్ గ్రేడ్ (తరగతి)లో "అలక్ష్యంచేయబడిన పిల్లలంటూ ఎప్పుడూ లేరు."

సెకండ్ గ్రేడ్ విద్యా కార్యక్రమంలోని వివిధ సమయాల్లో తలితండ్రులను ఆమె సమావేశపరిచి, వారికి విషయాలన్నీ విశదపర్చి చెబుతుంది. సాధారణంగా తొలిసమావేశంలో భాషావిషయాలు చర్చిస్తారు. "బాలబాలికలు విభిన్న వేగాలతో అభివృద్ధి చెందుతూంటారని తలితండ్రులు అవగాహన చేసుకొనటంలో క్రమ సహాయం చేస్తూంటాను." పఠించుటమంటే కేవలం చిలకపలుకుల్లాగ మాటలు ఒప్పచెప్పటం కాదని ఆమె. తెలియచెబుతుంది. తమ పిల్లలు బాగా చదువుతున్నారో లేదో అని సతమతమవుతున్న తలితండ్రులు, ఆ సెకండ్ గ్రేడ్ పఠన (ఫోనెటిక్స్) కార్యక్రమం తెలుసుకొన్న తర్వాత ఎంతో హాయి పొందుతారు.

తలితండ్రులు తమ ద్వితీయ సమావేశంలో, పిల్లలు లెక్కలు ఎలా నేర్చుకొంటున్నారో, తెలుసుకో కలుగుతారు. తృతీయ సమావేశంలో కామిక్ బుక్స్, టెలివిజన్ తిలకించటం విషయమైన కట్టుబాట్లు, సెకండ్ గ్రేడ్ విద్యార్థి తనఇంట్లో ఎలా ప్రవర్తించాలో మొదలగు క్లిష్ట సమస్యలకు మిస్ లిస్టర్ బార్జర్ పరిష్కార మార్గాలను గురించి వివరిస్తుంది.

ఆ సమావేశాల మూలంగా తలితండ్రులందరూ తమ పిల్లల అభివృద్ధిని ఓర్పుతో కనిపెడుతూంటారు. ఆ సప్తవర్షవయస్కుల జీవితాలను తీర్చి దిద్దటంలో తలితండ్రులూ, ఆమే సహాధ్యాయులుగా పనిచేయటం నేర్చుకొంటారు.

సెకండరీ గ్రేడ్ విద్యా విధానం; విద్యార్థుల్లోని విభిన్న ప్రవర్తనలు; ఆమె లక్ష్యాలూ, వాటిని సాధించేటందుకు ఆమె తీర్చి దిద్దుతూన్న మార్గాలు వర్ణిస్తూ మిస్ లిస్టర్ బార్జర్ తాను రచించిన ఒక పుస్తకాన్ని తలితండ్రులందరికీ పంచిపెడుతుంది.

పిల్లలు తాము చదువుకోవాలని తెలుసుకొంటే వారు తప్పక చదువుకొంటారన్న మిస్ లిస్టర్ బార్జర్ సిద్ధాంతాన్ని ఆ పుస్తకంలో వ్యక్తం చేసింది. పిల్లలు పుస్తకాలు చదవటం అలవాటు చేసుకొనటంలో, సెకండ్ గ్రేడ్ సమయం అత్యంత క్లిష్టమైందని అంటుందామె. ఎందుకంటే ఆ సమ

యంలోనే, చదవటం, బాలలకు సరదా కలిగిస్తోందో లేక విసుగుపుట్టిస్తుందో తేలిపోతుంది. పిల్లల సామర్థ్యాభివృద్ధి తలితండ్రులు విలువ కట్టేటందుకు తగిన కిటుకులెన్నో ఆ పుస్తకంలో ఉన్నవి.

సెకండ్ గ్రేడ్ లెక్కల్లో ఈ క్రింది మాదిరివి ఉంటవి. ఒకట్లు పదులు వందలు తెలుసుకొంటూ 200 వరకూ లెక్కించటం; పదిలోపు అంకెలతో కూడికలు; పదిగానీ అంతకంటే చిన్నదైన అంకె 'ఆన్సర్'గా వచ్చే తీసివేతలు; భిన్నాల ప్రాథమిక ఉపయోగం; కాలం, ద్రవ్యం, బరువు, పొడవు వెడల్పులను కొలవటం ఉంటవి. కూడికలు తీసివేతలు కలిగిన చిన్న లెక్కలను ఆమె తరగతిలో చేయిస్తుంది. అంతేకాకుండా ఆట పాటలద్వారా అంకెలు పిల్లల నోటికొచ్చేటట్టుకూడా ఆమె నేర్పుతుంది.

ఇక భాషావిషయంలో పిల్లలు చూసినవిషయాలను వారిచేత తిరిగి చెప్పించటంలో ఆమె ఎంతో శ్రద్ధతీసుకొంటుంది. ఈ సమయంలోనే క్రొత్త క్రొత్త విషయాలు వారు విని తెలుసుకొనే అలవాట్లుకూడా వారిలో పెంపొందేటట్టు చూస్తుంది.

అగ్నిమాపక నిలయానికిగానీ లేదా పోస్టు ఆఫీసుకు గానీ పిల్లలు వెళ్ళివచ్చినప్పుడు వారి అనుభవాలను వ్యాసరూపంలో వ్రాయిస్తుంది. అలా వ్రాస్తున్నప్పుడు వర్ణక్రమము, వాక్యనిర్మాణం వారిలో అభివృద్ధి చెందుతవి. అలా అలవాటు చేస్తూ ఆ విద్యార్థులలో కొందరు - ఒక్కొక్క భావం కేంద్రీకృతమైన పారగ్రాఫులతో వ్యాసాలు వ్రాయ మొదలుపెడతారు. ఇటీవల ఫైర్ స్టేషన్‌ను వారు చూచివచ్చిన తర్వాత వారిలో అయిదారుగురు కలిసి రెండు చిత్రాలు లిఖించారు. అవి నిజంగా క్రొత్త ఉద్దేశ్యమే. అంతేగాక సమిష్టిగా కృషిచెయ్యటానికి అది చక్కనిమార్గము. అక్కడ వారు చూచిన, నిచ్చెన, ఇంజన్, బూట్లు, సైరన్, హెల్మెట్ మొదలగు క్రొత్తపదాలూ వాటి వర్ణక్రమం నేర్చుకొనటానికి అలా వీలుకలిగింది.

పాఠ్యక్రమావళిలో అటవీ సంచారంకూడా ఒక అంశం. పిల్లలను వెంటపెట్టుకొని మిస్ లిస్టర్ బార్జర్ అడవిలో పర్యటించి వస్తూంటుంది. వారందరూ తిరిగివచ్చిన తర్వాత వారక్కడనుంచి తెచ్చిన వింత నమూనాలను పరిశీలిస్తారు, వారి పర్యటనను వర్ణిస్తూ వ్యాసాలు తయారుచేస్తారు, వారుచూచిన వాటినిగురించి బొమ్మలు వేస్తారు, అపూర్వవిషయాలేమైనా వారికి తటస్థిస్తే వాటిని జాగ్రత్తగా వ్రాసిపెట్టుకొంటారు.

శాస్త్రీయవిషయాలపై మిస్ లిస్టర్ బార్జర్ శ్రద్ధతీసుకొంటుంది. ఆమె తన విద్యార్థుల తలితండ్రులకు శాస్త్రీయ విచిత్రాలు చెబుతున్నప్పుడు ఆ చిన్నారి పాపలు ఎంతో శ్రద్ధగా వింటుంటారు. ఆ బాలల ప్రపంచంలో ప్రతీది నూతనంగానూ, ఆశ్చర్యంగానూ కనిపిస్తుంటుంది. వారు శాస్త్రీయ సత్యాలను ఇట్టే గ్రహించగలుగుతారు. వారు జీవిస్తున్న లోకాన్నిగురించి ఎన్నోవిషయాలు తెలుసుకో ప్రారంభిస్తారు. వాటిలో కొన్ని ఇవి- విత్తులు ఎలా వృక్షాలవుతవి? మన జీవితాలకు నీరు, సూర్యరశ్మి ఎలా ఉపయోగపడుతున్నది? మృగాలలో ఎన్నిజాతులు ఉన్నవి? అవి ఏమిటి? వాతావరణానికి శీతోష్ణస్థితికీగల సంబంధం ఏమిటి? అదే విధంగానే వాతావరణానికీ మన దైనందిన జీవితాలకూగల సంబంధం ఏమిటి? భావిశాస్త్రవేత్తలుగా తయారుకాగల ఆ పసికందులకు ఈ తరగతిలో ఎంతో ప్రోత్సాహమిచ్చి, శిక్షణనిస్తారు.

మిస్ లిస్టర్ బార్జర్ కృషి ఫలప్రదమయిందని చెప్పటానికి ఆ పాఠశాల ప్రముఖ విద్యా విధానమే ప్రబల తార్కాణం. విశాలమైన తరగతి గదులూ, ఆధునిక విద్యావిధానానికి అనువైన నూతన పరికరాలు గల ఆ పాఠశాల ఆ పట్టణానికే గర్వకారణంగా ఉంది. అక్కడి చిన్నారిపాపలు చిట్టిచిట్టి కుర్చీలూ బల్లల దగ్గర కూర్చొని నమూనాలు పరిశీలిస్తారు. సేకరించిన వస్తువులను ప్రదర్శిస్తారు. చిన్ని చిన్ని జట్లుగ చేరి పరిస్తారు. వర్ణచిత్రాలు లిఖిస్తారు.

పచ్చని మొక్కలతోనూ, పుస్తకాల అరలతోనూ, పిల్లల చేతిపనుల ప్రదర్శనంతోనూ ఆ గది చూడ ముచ్చటగా ఉంటుంది. "క్రమబద్ధ వాతావరణంలో ఆ గది ఎంతో కళకళలాడుతూ ఉంటుంది" అని ఆ ఎడ్వర్డ్స్ పాఠశాల ప్రిన్సిపాల్ ఇ సి. అవ్‌రాండ్ అన్నారు.

మిస్ లిస్టర్ బార్జర్ స్వస్థలం అయోవా రాష్ట్రంలోని ఫెయిర్‌ఫాక్స్. ఆమె 1951లో అయోవాలోని మౌంట్ వెర్నన్‌లో ఉన్న కార్నెల్ కళాశాలలో విద్య అభ్యసించి పట్టభద్రురాలయింది. ఆ సంవత్సరమే ఉపాధ్యాయవృత్తి స్వీకరించింది. దానితోపాటు ఆమె అనేక మెథడిస్టు యువజనోద్యమాలలో పాల్గొన్నది. ఆమెకు ఎం. ఏ. డిగ్రీ పొందాలనిఉంది. స్కాలర్‌షిప్ దొరికే పక్షంలో ఆమె ఒక ఏడాది సెలవుపెట్టి, ఉన్నత విద్య అభ్యసిస్తుంది.

## "కలహాంతరిత"

శ్రీ వి. సి. మాలి

లీలగసోకె నీదు మురళీరవళీ పవమాన వీచికా
డోలిక నాదువీనుల వళుల్ వళుతాచు మరందమాధురుల్
జాలులు వాఱమై పరవశత్వము నొందగశయ్య వీడి ని
ద్రాలసనయ్యు వచ్చితినిరా! మధుమాసనిశీధ వేళలో,
వేణువు నూదినావు, తనువేమరపింపగ జేసినావు: ని
ద్రాణను లేపినావు, మధురమ్మగు బాధను రేపినావు: నా
వేణికలూడ గూడ పరువెత్తగ తొందర పెట్టినావు ; తీ
రానిను జూడనేడ కనరావిది యేల ప్రభూ! వనమ్ములో!
కమ్మని వెన్నెలల్ విరియగా చెడిపున్నమ రేయిరా! సుగం
ధమ్ములు జిమ్మ శీత మరుదంకురముల్ మెయిపుల్కరింప మం
దమ్ముగ వీచురా! మృదుమృణాళకరమ్ములసాతు రోమహ
ర్షమ్మొలికించునీదు పరిరంభణమున్ దయసేయవా ప్రభూ!
రావిదియేలబోయి! కనరా వెటుజూచిన నేలనోయి! నె
త్తావులు జిమ్మమల్లె విరిదండలు నీకయి గ్రుచ్చినాను, కె
మ్మోవితొణంకు నవ్యమధువుల్ దయసేయగదోయి నాకు కృ
ష్ణా! వనవీధినుండి, నెఱజాణవుగా! ఇక జాలురమ్మురా!
ఏది! మరొక్కమారు వినిపింపగదోయి! త్వదీయ వేణుకా
నాదము ; పట్టుకొందును క్షణమ్మున ! నే పొదరింట దాగి, స
మ్మోదము నొందుచుంటివో, ప్రభూ! గికురింపగ నేల నన్ను ఇం
కాదయరాద! రమ్మికసఖా! చిరునవ్వులు చెంగలింపగన్.॥

—X—

# కాబూలీ - వాలా

శ్రీమతి యమ్. శకుంతల



అయిదేళ్లు పూర్తిగా నిండకపోయినా మా, మిని ఎంతో అల్లరిచేస్తుంది. ఆమె నోరు అస్తమానం వాగుతునే వుంటుంది. ఆమె నోట్లోంచి వచ్చే అవ్యక్తవాక్యాలు నన్నెంతగానో సంతోషపెట్టేవికాని వాళ్లమ్మని విసిగించేవి.

ఒక రోజున నేను నవల వ్రాసుకొంటుండగా పరుగెత్తుకొంటూ వచ్చింది మిని నా గదిలోకి. వచ్చి, "నాన్నా! రాందయాల్, "కాకి" అని సరిగ్గా అనలేడేం? వాడికి స్వచ్ఛంగా మాట్లాట్టం రాదా?" అంది.

ఆమెకేదో సమాధానం చెప్పకుండానే, "మేఘాలచాటున ఏనుగులుండి, నీళ్లు తొండాల్తో చిమ్ముతుంటే మనికి వర్షం కురుస్తోందని భోలా అంటున్నాడు. ఇది నిజమేనా?" అని అడిగింది.

వెంటనే, "నాన్నా! అమ్మకి నీకు సంబంధం ఏమిటి?" అని అడిగింది.

ఈ ప్రశ్న అడగటంతోటే నాకు కాస్త కోపంవచ్చింది. దాన్తో ముఖం చిట్లించి "నీవుపోయి భోలాతో ఆడుకో" అన్నా.

నా గది కిటికీలోంచిచూస్తే రోడ్డంతా కనుపిస్తుంది. మిని నా కాళ్ల దగ్గరే కూర్చొని ఆడుకొంటోంది. నేను నవలలో ప్రతాపసింహుడు కాంచన లతని భుజం మీద వేసుకొని మూడో అంతస్తు కిటికీలోంచి పారిపోయే ఘట్టం వ్రాస్తుండగా మిని ఆట మానేసి, కిటికీదగ్గరికి పరుగెత్తి, "కాబూలీవాలా! కాబూలీవాలా!" అని పిలిచింది. పిలవగానే పళ్లమ్మకొనే కాబూలీవాలా పైకి చూశాడు.

అతను రావటం చూడగానే మినికి భయంవేసింది. ఆ భయంతో వాళ్లమ్మ దగ్గరికి పరుగెత్తుకుపోయింది.

అతను రావటంవల్ల నవల వ్రాయటానికి స్వస్తి చెప్పాల్సొచ్చింది.

అతను రాగానే మంచిచెడ్డలు ముచ్చటించి మినికోసం కొన్నిపళ్లుకొన్నాక, "ఆ చిట్టితల్లి ఏదండిబాబూ" అని అడిగాడా వ్యాపారి.

కాబూలీవాలాని బూచి అనుకొని పారిపోయింది మిని. తనని సంచీలోవేసి కొనిపోతాడని ఆమె నమ్మకం

ఆమెకుండే ఆ మూఢ నమ్మకాన్ని పోగొట్టాలని ఆమెను రప్పించాను.

ఆమె రాగానే కొన్నిపళ్లని చేత్తోతీసి ఆమె కివ్వబోయాడా వ్యాపారి. కాని మిని వాటిని తీసికోటానికి సందేహించింది. సందేహించి నా కాళ్లను గట్టిగా కరుచుకొంది.

అదే వాళ్లిద్దరు మొట్టమొదటిసారిగా కలవటం.

కొన్ని రోజులు జరిగిపోయిన తర్వాత ఒక రోజున మిని కాబూలీవాలా దగ్గర కూర్చొని అతడు చెప్పే కబుర్లు వింటూ నవ్వటం చూసి ఆశ్చర్యపడ్డాను. అంత వఱకు మిని వాకళ్లు చెప్పిన కబుర్లంత శ్రద్ధగా వినేది కాదు. ఆమె కట్టుకొన్న చీరలో మూల పళ్లని మూటకట్టింది.

"ఎందుకా పళ్లను మినికి ఇస్తుంటావు వ్యాపారీ ?" అంటూ ఒక అర్ధరూపాయి కాసు అతనికిచ్చి వెళ్ళిపొయ్యాను.

నేను తిరిగి వచ్చేసరికి మినిని వాళ్లమ్మ కొడుతూ "నీకీఅర్ధరూపాయి కాసెక్కడిదే ?" అంటూ కళ్లెఱ్ఱజేస్తోంది.

"నాకు కాబూలీవాలా ఇచ్చాడమ్మా" అంటోంది మిని.

ఇదంతా చూసి, 'నేనే, కాబూలీవాలాకి అర్ధరూపాయి కాసొకటి ఇచ్చి వెళ్ళిపోయానని అతడు దాన్ని మినికి ఇచ్చివుంటా'డని చెప్పి ఆ ఘట్టాన్ని పూర్తిచేశాను.

తర్వాత అనేకసార్లు మిని కాబూలీవాలాతో కబుర్లు చెప్పటం, అతను చెప్పే కబుర్లు వినటం గమనించాను. వాళ్లిద్దరి సంభాషణవిని, కడుపుబ్బ నవ్వాల్సిందే :

అతనిముందు కూర్చొని, అతని సంచి కేసి చూస్తూ, "కాబూలీవాలా! నీ సంచిలో ఏముంది ?" అని అడిగేది మిని.

"ఏనుగుందమ్మా" అనేవాడా వ్యాపారి ముక్కుతోటి. ఆ మాటకి ఎంతో గానో నవ్వేది మిని.

"మిని! మీ ఫాదర్ ఇన్ లాస్ హౌస్‌కి ఎప్పుడు వెళతావో చెప్తావా" అనేవాడా వ్యాపారి. ఆ ప్రశ్నకి మినిలో కొంత సంచలనం కలుగుతుందని అతని అభిప్రాయం.

కాని మినిలో అతడనుకొన్నట్టు సంచలనం కలగేది కాదు.

"నువ్వెక్కడికి వెళుతున్నావా!" అని అడిగేది మిని మారుగా :

కాబూలీ తెగవారు ఫాదర్ ఇన్ లాస్ హౌస్‌కి రెండర్థాలు చెప్తారు.

ఒకటి మామగారి ఇల్లని, రెండు పోలీసు వారు కాపలావుండే కారాగారం అని.

"నువ్వెక్కడికి వెళుతున్నావా ?" అని మిని అడగ్గానే లాల్చీ చేతులు పైకిమడిచి, "నా ముసలి ఫాదర్ ఇన్ లాని ఈ పిడికిలితో గుద్దిచంపేస్తా" అనేవాడు కాబూలీవాలా.

అతని మాటలువిని కడుపుబ్బ నవ్వేది మిని.

మిని తల్లికి పిరికితనం ఎక్కువ. వీధుల్లో ఏదైనా శబ్దం వినబడితే వులిక్కిపడేది. వీధిలోంచిపోయే బాటసారుల్ని చూసి దొంగలని, త్రాగుబోతులని భయపడేది.

కాబూలీవాలానికూడా అనుమా

నించేది. "అతన్నో కంటితో చూస్తుండమని" నాకు చెప్తుండేది

ఆమె చెప్పే ఆ మాటలు వినఁగానే నాకు నవ్వొచ్చేది.

"ఒకసారి, ఇదివర్లో పిల్లల్నెవ్వరూ ఎత్తుకుపోలేదా"

"కాబూల్‌లో బానిసత్వంలేదా?"

"ఆ పెద్ద కాబూలీవాలా మనచిన్న అమ్మాయిని ఎత్తుకు పోలేడా!" అని ఎన్నో ప్రశ్నలు అడిగింది నన్ను.

అతఁడు మినిని ఎత్తుకుపోవటం జరఁగని కృత్యం అనివాదించాను.

ఎంత చెప్పినా, ఎంత వాదించినా, ఆమెలో చిరస్థాయిగానిల్చిపోయిన భయభూతం మాయమవలేదు.

మినికి పరమమిత్రుఁడైన కాబూలీవాలా మా ఇంటికి రోజూవస్తూ పోతూనే వున్నాడు.

వారిద్దరి స్నేహం బలవత్తరం అవసాఁగింది.

సంవత్సరానికొకసారి కాబూలీవాలా, రహమాన్, జనవరినెలలో తనదేశానికి వెళ్లి వచ్చేవాఁడు. తనదేశానికి వెళ్లే ముందు తనకి రావలసిన బాకీలని వసూలు చేసుకోటంతో సరిపోయేదతనికి.

ఈ సంవత్సరం తనదేశం వెళ్లేముందు బాకీలు వసూలు చేసికోటంతో సరిపోయినా, రోజుకోసారైనా మా యింటికి రాకుండా వుండేవాఁడు కాదు.

వయస్సులో అత్యంతవ్యత్యాసం గల వాళ్లిద్దరు అంతస్నేహంగా వున్నారంటే విచిత్రంకదా!

ఆవ్యాపారి తనదేశం వెళ్లిపోవటానికి నిర్ణయించుకొన్న రోజుకీ, కొద్దిరోజులు ముందుగా ఒక రోజున వుదయాన్నే నాగదిలోకూర్చొని కాగితాలు ఫైలు చేస్తున్నా.

చల్లని పిల్ల వాయువులు మెల్లగావీస్తున్నయ్. ఎనిమిది గంటలైవుంటుందేమో అప్పుడు, లేత సూర్య కిరణాలు చలిని పోగొడ్తున్నయ్.

అకస్మాత్తుగా వీధిలో పెద్దపెద్ద కేకలు వినవచ్చాయ్. ఆ కేకలువిని కిటికీలోంచి చూశాను. రెహమాన్‌ని ఇద్దరు పోలీసులు పట్టుకుపోతున్నారు. వాళ్ల వెనకాల పిల్లలు గోల చేస్తున్నారు.

రహమాన్ బట్టలమీఁద నెత్తురు మరకలున్నయ్. ఒక పోలీసు చేతులో చాకుంది.

ఇదంతా చూసి బయటకొచ్చి విచారించగా, రాంపూరిశాలువాని రహమాన్ దగ్గర వొకఁడుకొని, కొనలేదని అబద్ధం ఆడాడని, వెంటనే అతణ్ణి రహమాన్ కొట్టాడని తెలిసింది.

(సశేషము)

# కామాయని

మూలం : **శ్రీ జయశంకరప్రసాదు**

అనుసరణ : **శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.**

(గతసంచిక తరువాయి)

"సుందరీ - నా శిధిల నిశిర జీవితమున కత్యంత సుందర సందేశము నందించు దేవదూతివైన యుదార మూర్తివి నీ వెవ్వరవు ? నా యంధకారమునంత మందించు విద్యుల్లతికవు. నా హృదయతాపము నుపశమించు శీతలమలయ పవనమవు. నీ వెవ్వతవు ? చెప్పుము — శుభమయీ, చెప్పు ! "

శ్రద్ధ మనువున కిట్లు సవినయముగ ప్రత్యుత్తర మిచ్చెను. "స్వామీ, నన్నుగూర్చి నేనెరిగింపవలె నన్నచో, మందటిమాట - నా పితృపాదుల ప్రియ సంతానమును నేను - మేము గాంధారదేశవాసులము. లలితకళాభ్యసనము నా కత్యంత ప్రమోదకరము. ఒకప్పుడు నేనీ హిమవత్పర్వతము దిక్కున చూచుచు, కష్టభారముచే పుడమియే ఇట్లు మడతపడెనా యను కొంటిని. నా మనస్సునం దాందోళన పట్టజాలక యొక్కనాడు నేను ముందునకువచ్చి ఈ పర్వత మాలికలయందలి యపార సౌందర్యమునుచూచి ఆకలి దప్పులనుకూడ మరచి విహరించుచుంటిని. కొన్ని దినములు గడచెను. ఇట్లుండగా యనంతసాగరమీ పర్వతమును చుట్టిముట్టి గట్టితాకిళ్లతో తట్టసాగినవి. నాటినుండి ఇచటనే, నేనేకాకినై తిరుగాడుచు నిటకు వచ్చితిని. ఇచట యజ్ఞబలుల యన్నము లుండుటనుచూచి, ఈ ప్రాంతముననే మరియొక వ్యక్తి నిస్సంశయముగా జీవించి యుండునని తలచితిని."

"హేతపస్వీ, నీవేల దుఃఖమయుడవై, తీవ్రవేదనలతో హతాశుడవై యుండుచుంటివి ? వైరాగ్యమొక సుందరరూపమున నీ మనమున ప్రవేశించి, నీలోని జీవనకాంక్షను నిశ్శేష మొనర్చుచు వంచన నొనర్చుచున్నదాఏమి ? — దుఃఖములకు వెరచి, కామమునుండి తప్పించుకొనుటకై భీరుత్వమున పారిపో జూచుచుంటివాయేమి ? దుఃఖమనునది ఈశ్వరుని శాపము కాదు ! అదియొక వరము సుమీ ! దుఃఖమనెడు చీకటి రాత్రియేకదా సుఖమను నవోషస్సును ప్రసవించునది ? - ఉత్సాహమయుడవై యుండుము. దుఃఖముకూడ పరాత్పర దత్తమగు శుభమనియే తలచుము."

మనువు:—"జవ్వనీ, నీ మాటలుత్సాహ కరములుగనున్నను నాజీవనము సుఖోపాయ విహీనమైనది. వాస్తవముగా జీవనపరిణామము నిరాశ మాత్రమే. గాంధారపుత్రీ, నన్నీ నిరాశతో, నిస్పృహతోడి తపముతో జీవనమును వ్యయమొనర్చుకొననిమ్ము."

శ్రద్ధ:—"తపస్వీ, ఏల యింతటి ధైర్య విముఖత ? కేవలము తపమొనర్చుటయే జీవనముకాదుసుమీ. ఒక క్రొత్తను కనుగొనుము. ప్రకృతి ఎల్లపుడును పురాతన పద్ధతినే సహించదు. జీవనము ప్రకృతి యందుండుటచేత - నదియును ప్రకృతి కనుగుణముగ చరించుచుండును. జీవిత వికాసము నవీనత యందున్నది ! వాడిన పూలతోడనే ఎల్లప్పుడు ప్రకృతి తనను సింగారించుకొనదు ! వాడిన కుసుమములను దూళిపాలొనర్చి, వెంటనే నవవికసిత సుకుమార కుసుమములతో తన నలంకరించుకొనును. అందువలననే ప్రకృతి నిత్యయవ్వనయైనది ! శ్రద్ధ, తన ప్రసంగముద్వారా చిరకాలమునుండి మనువు ఆచరించుచున్న నిశ్శబ్ద నైరాశ్యమయ తపోజీవనము నొకింత సడలించి,

నవాగతయగు తన సాంగత్యమును స్వీకరింపుమని సూచించినది.”

ఆమె తనను తాను మనువుకడ సర్పణ మొసంగుచు నిట్లనెను “ఈ విశాల విశ్వమున నేకాంతవాస మొనర్చు పుణ్యుడవైన నీ కిదే నేను సహచారిణినై భవసాగర తరుణోపాయములైన నా సేవల నర్పించుచున్నాను. నేడు నా జీవిత సర్వస్వమును, నా యందలి దయ, మమత, మాయ, సౌందర్యము అన్నియును నీ పదపంకజములప్రోల నర్పించితిని. గుణరత్న భాండారమైన నా స్వచ్ఛహృదయము నీ యధీనమైనది. శక్తిశాలివై జయమును చూరగొనుమను పరాత్పరుని మంగళాదేశము నీ కింకను వినబడుట లేదా! మునీ, నిర్భయముతో స్వీకరించు, జీవనధ్యేయమును సాధించు ...”

మనువందులకు సుముఖుడైనట్లు కనుపించగనే శ్రద్ధ మరల నిట్లనెను. “మనుష్యునిలో నంతర్నిహితమైయుండు శక్తి, వ్యస్తమై వ్యాకులమై ఉపాయశూన్యమై చెల్లాచెదరై యున్నది. అట్టి శక్తిని సమన్వయ మొనర్చి మానవత విజయమునందుగాక” అనుచు ప్రకృతిపై విజయము సాధింపనాదేశించెను ఆమె వచనముల ప్రభావము మనువును పూర్ణము వశమొనర్చుకొనెను.

## కా మ ము

శ్రద్ధ ఉత్సాహ వచనములతో మనువునకు మనోధైర్యము కల్గించెను. పిమ్మట మనువు శ్రద్ధయొక్క సౌందర్య ప్రేమామృత ధారాతర్పణములచే తనను తృప్తినొందించుకొనుటకై సంయమమును త్యాగమొనర్పదలచినాడు. భోగవిలాస భరితమైన పూర్వపు సంస్కారము అతనిలో మరల తలనెత్తినది. ఆ నాటి యర్ధరాత్రమున, నలుగడల నలమిన చీకటులమధ్య సమాసీనుడై, శ్రద్ధయొక్క సౌందర్య, భోగప్రేమామృతములనుగూర్చి యోచించు, కొంత వడికి నిద్రాదేవతయొడిలో విశ్రమించినాడు.

నాటిరాత్రి స్వప్నములో కామదేవుని సాక్షాత్కారమైనది. ఆ దైవమును మధుర కంఠముతో మనువున కిట్లు సందేశించెను. “దేవలోకమున, నిజసతియగు ‘రతి’తో సుఖోపభోగముల తేలియాడుచుండెడి కాముడను నేను! నేను ‘తృష్ణ’ను సంచరింపజేయుచుండగా ఆ తృష్ణాపూర్తికి తగు సాధనములను మార్గములను ‘రతి’ చూపుచుండును. మా యిరువురి సత్యమును, లోకమునకొక యాకారమును, స్వరూపమును కల్పించునట్టి సుందర విశ్వముసృజించు ప్రారంభిక చక్రము! ప్రకృతి పుష్పవతియైన లతవోలె, నవయవ్వనముతో నూగులాడు సమయాన, పురుషుడు దానికై తన, నవవసంత మధుహాసములను వెదజల్లగా, స్త్రీ, పురుషులను రెండు సుందర స్వరూపములుద్భవించినవి.” ఇది దేవసృష్టిగాథ: దేవసృష్టిగాథ.

“దేవసృష్టి నాశనమైనది. అంతటితో భోగవిలాసములంత మొందినవి. ఐనను నా తృష్ణ ఇంకను నన్నంటియే యున్నది. జలప్లావనానంతరముగూడ నేనును, నా భార్యయగు రతియును, బ్రతికియే యుంటిమి. నాయనా, మనూ, ఈ లోకమంతయు ప్రేమలీల యొక్క విచిత్ర విలాసము. ఆ సందేశమును లోకమున కెరిగించుటకే, ‘శ్రద్ధ’ నాచే నియుక్తురాలై లోకమున కంపబడినది. ఆమె నాకును, రతికిని ముద్దుబిడ్డ. మనూ, ఆమెయందు చాల మహత్వమున్నది. శ్రద్ధ జడచేతన వస్తువుల సంబంధమును సమన్వయపరచును. అశాంత జీవనములకు శాంతిని ప్రసాదించును. ఆమెను నీవు పొందగోరితివేని తగిన యోగ్యతలను సంపాదించి, అర్హుడవుకమ్ము.”

ఆ ధ్వని యటులనే యంతర్లీనమయ్యెను. మనువు కండ్లుతెరచి, “ఆమెను పొందుట కర్హతలను, మార్గములను నీవే వచింపు”మను సరికి కాము డదృశ్యుడయ్యెను. అతని సుందర మధుర స్వప్నము ముగిసెను. ఇంతలో బాల సూర్యుడు నిజప్రభాపటలములచే లోకమును జాగరిత మొనర్చెను. అంతటను ప్రకాశమయమైనది.

## వా స న

శ్రద్ధామనువులు పరస్పర మాత్మసమర్పణ మొనర్చి

కొనిరి. ఐనను ఆ యాత్మ సమర్పణము దాంపత్య ప్రేమగా పరివర్తన నొందలేదు. శ్రద్ధమనువునొద్ద కేవలమతిథి రూపముననే యుండెడిది.

మనువు క్రమక్రమముగా 'వాసన'లచే సుత్తేజితుడయ్యెను. కాముని మధురగాన మాతని కర్ణములందు నిరంతరమును గింగురు వెట్టుచుండెను. శ్రద్ధయొక్క యనుపమ సౌందర్యమునకు, కళామయమైన నవయవ సౌష్టవమునకును, ముగ్ధుడై, మోహపరవశుడై, ఆమెను తన భుజపాశములలో బంధించి గాఢాలింగన మొనర్చుకొను మధుర క్షణమునకై తహతహలాడినాడు మనువు.

శ్రద్ధయును, చిరకాలానుభవమున్న గృహిణివలె, ఇంటిపనులను చక్కబెట్టుచుండెను. ఆమె కార్యకుశలతతో మనువున కానందాశ్చర్యములను కలుగ చేసెను. ఒక దినమున శ్రద్ధ యొక పశువును తోలుకొని వచ్చుచుండగా "ఈ పశువు నాకంటె నయము. ఇది శ్రద్ధయొక్క సంసర్గ ప్రేమముల కధికారిణి యయ్యెను"-అని తలచెను. ఆతని మనమున నీర్ష్యాగ్ని జ్వలించెను. తన జీవన ప్రభ్వియైన శ్రద్ధాదేవియొక్క హార్దిక ప్రేమకే ఇతర ప్రాణియైనను పాత్రమగుట యాతనికి దుస్సహమయ్యెను. ఆమెయొక్క రూప యవ్వన సౌందర్యములకు తానొక్కడే సంపూర్ణముగ ననుభవించు యధికారి కావలెనని యూహించెను. అట్టి ప్రవృత్తి పురుషజాతికి సహజము! మనువా జాతికి ప్రతినిధి. శ్రద్ధ గృహకృత్యములను చక్కబెట్టుకొని, విషణ్ణవదనుడై కూరుచున్న మనువును 'ఏల నీ విక్లైతివ'ని పృచ్ఛచేసెను. ఆ మధుర శబ్దములతో మనుని మనమున పొడుకొన్న ఈర్ష్యయొకింత తొలగినది. మనువేమియు సమాధానమీయక, మౌనముగా, నామె సౌందర్యఛాయలలో విశ్రాంతి నందుచు, తన యభీష్టము పూర్తి కానున్నదో లేదో నను జిజ్ఞాసతో నొకింత విహ్వలతజెంది యామె వైపునకు మరల మరల జూడ మొదలిడినాడు.

"మనూ ఇదివరకెన్నడూ కానరాని యశాంతి మీ ముఖమండలమున నేడేల ద్యోతకమగుచున్నది? మీ కలవరపాటునకు కారణమేమో? అటుచూడుడు! జ్యోత్స్నావితానోద్యమన్నుడగు నంశుమంతుడు, శీతకోణములతో మనలనాహ్వానించుచున్నాడు! ఆ మనోహర అచ్చటలతో హృదయములనొక్కపరి క్షాళనచేసి స్వచ్ఛమొనర్చు కొందుమా? మరియొక వైపున మహీధరములు స్వకీయ శిఖరాగ్రములచే ఆకాశమునుచుంబింప యత్నించుచున్నవి! అస్తంగతుడగు రవి తన యరుణకిరణములా విశ్వాసమయములగు మలయములందు ఇప్పుడే నిక్షిప్తమొనర్చుకొనుచున్నాడు! ఒక్కపరి, మనమా మధురమయమగు ప్రకృతియొక్క సాధనా రాజ్యమున విహరింపబోదమా?" అనుచు శ్రద్ధప్రేమపాథేయముమ చేత నిడికొని స్వప్నపథము వైపునకు నడచినది. మనువామె రూప మార్దవ మాధుర్యములకు మంత్రముగ్ధుడై యిట్లనెను. "శ్రద్ధా, నేను నిన్ను మొన్నెన్నిసారులో చూచినను నేటి నీయపూర్వ సౌందర్యమును కాంచలేకపోతిని. నీవొక యందాలరాశివి. ఇన్నినాళ్లు నా చెంతనుండగనే నిన్ను కానలేని - నీసౌందర్యమును గమనించలేని, నేను సౌందర్య తృష్ణా విహ్వలుడనై యుంటిని." మనువులో విసర్గమైన మనోవాసనలొక్కసారిగ విజృంభమాణములైన యా సమయమున శ్రద్ధసంయమ జీవితమునుగూర్చి ధర్మపన్నములు పలికిన నేమిఫలము? ఆతడామె హస్తపల్లమును గట్టిగ పట్టుకొని, మరలనిట్లనెను. "నేడు నేనొక యపూర్వ సుందరదృశ్యమును తిలకించుచున్నాను. ఏ సౌందర్యముకొరకై నేను బహుదీర్ఘ కాలమునుండి తపించుచుంటినో ఆసౌందర్యమువు నీవే! నిన్ను చెంత నిడికొనియే, నీకొరకు లోకమున నన్వేషించు వెడగు నేను ఇంతకాలమును నాస్మృతినొక, విస్మరణసాగరమున తీరముగానక నిటునటు లూగులాడినది! జవ్వనీ, నీవు నాజన్మసంగిణివి. కాముని పుత్రికవైన శ్రద్ధవు నీవు! నా ప్రాణమునకు శాంతినిచ్చు జవరాలవు! అటు చూడు. చంద్రదేవుడు, తారకామాలికలతో ప్రేమని మంత్రమొనర్చుచున్నాడు! నా హృదయరాజ్ఞీ, నా సర్వస్వమును, నన్నును నీవానిగజేసికొని, నా

ఏకైక జీవనాభిలాషను పూర్ణమొనర్చి, నా సమర్పణమునంగీకరించి, నాజన్మను సఫలమొనర్చుము.”

పురుషుడు స్వాభావికమైన యావేశముతో స్వాత్మసమర్పణమునవి, సులభముగ చేసివైచును. కాని తుదివరకట్లేయుంచజాలడు. నారి హృదయము చిరానుబంధమునే యభిలషించును. మనువు తన స్వార్థము సిద్ధింపచేసికొని, తదనంతర మామెను పేక్షింపకుండుటకై హెచ్చరికధ్వనించునట్లు ఆమె ఇట్లుబదులుపలికెను.

“హేదేవా ! నేటి మీ ప్రేమ సమర్పణము నారీహృదయమునకై శాశ్వతబంధమగునా ? నేనబలను, అమోఘమైన మీ ప్రేమ నూహించగలనో లేదో ! ఆ ప్రేమ, తదుపభోగమును, ఫలితమున నన్ను సదా వినాశమొనర్చుచునే యుండునుకదా !” అని దీనముగ పలుకచుండగనే, మనువు ‘దనోస్మి’ అనుచు మందహాసములతో నామెను లోబరచికొనెను. పురుషుని మందహాసలీలలు, శ్రద్ధలో నొక పరివర్తనమును గలుగజేసెను. అది లజ్జ !

## లజ్జ

మనువుయొక్క ప్రేమను పొందిన తరువాత శ్రద్ధయొక్క హృదయము క్రొత్త వాంఛల నభిలషింప సాగినది. ఒక్కనాడొక ఛాయామూర్తి స్వీయ సౌందర్యముతో నామెను ముగ్ధురాలుగ నొనర్చుచు ఆలింగనాపేక్షతో తన కభిముఖమై వచ్చుచున్నట్లు కనుపించినది. ఆ ఛాయా స్వరూపము ‘లజ్జ’ ఆ ఛాయామూర్తితో శ్రద్ధ యిట్లు సంబోధనమొనర్చెను.

“నా జీవన వనములోని నవశిరీషముల నెన్న మనోజ్ఞమూర్తీ, నీ వెవ్వరవు ? నిన్నాలింగన మొనర్చుకొనుటకై నా దేహమున గగుర్పాటుదవుచున్నది. ఏదో మౌనమైన స్వరముతో నీవు నన్నట్లుచేయకుండ నిరోధించుచున్నావు ! నేనాలాపింపబూనిన మధుర గీతిక నీ యనురోధమున ముఖరితము కాకున్నది !”

ఆ ఛాయామూర్తి చిరునగవుతో మరల నిట్లనెను.

“నేను పంచబాణుని పత్నియగు రతీదేవికి ప్రతిబింబమును. నా పేరు లజ్జ ! చంచల యవ్వనపు చదువులను నేర్పునాపని. గౌరవ మహత్తును బోధించు దాదివలె, యవ్వనమును పలావింతును. ప్రయాణ జీవనమున నెట్టిపాటులుంకల్గునో ముందుగనే యువజనులకు సూచింతును. వనితల సరళకపోలములపై యరుణ వర్ణమునై ప్రకాశించుదానను నేనే ! ముగ్ధయువతుల నేత్రాంజన రేఖనై మాదకతను సూచింతును. బాధ నభివ్యక్త మొనర్పజాలని బాలకునివలె తెలియని వేదననై ప్రకటితమగుదును ! చంచల యవ్వనపు సౌందర్యమును రక్షించుదానను నేనే ! మరి మరి చెప్పవలెనన్నచో వీనులందు సోకనుకుమార మంజులగానమును నేను ... లజ్జను !”

(సశేషము)






# తిక్క శంకరం

శ్రీ చుక్కా నాగేశ్వరరావు

అనంతవరం గ్రామంలో ఆనందయ్య ప్రఖ్యాత వైద్యుడు. ఆయన దగ్గరకొచ్చే ప్రతిరోగీ బాగుపడి పోవాల్సిందే. సర్వ రోగాలని చక్కగా కుదిర్చేవాడు. అందు చేత ఆ చుట్టుప్రక్కలగల పెద్దజమీందారులుకూడా యీయన్నే పిల్చేవారు. వైద్యానికి అసలు నాడి చూచి యిది ఫలానారోగం అని చెప్పటంలో ఆయనకు ఆయనే సాటి.

ఆయన దగ్గర వైద్యం నేర్చుకోటానికి శంకరం అనే వాళ్ల బంధువులబ్బాయి ఆయన్ని ఆశ్రయించాడు. తనకూ ఆ తీరిక లేకుండా వుందని చేతిక్రింద తరిఫీదుయిస్తే కొంతభారం తగ్గుతుందని ఆనందయ్యకూడా అనుకొన్నాడు.

మూడు సంవత్సరాలు చక్కగా తరిఫీదుయిచ్చాడు శంకరానికి. కాని శంకరంకు లోకజ్ఞానంలోటు. మందులు యివ్వటం, రోగం తెలుసుకోవటం తెలుసుకొన్నాడన్నమాటేకాని యింగితజ్ఞానం లోపించటంతో తిక్క శంకరం అనే పిలవాల్సివచ్చింది.

ఒకరోజు గురువుగారితో కలిసి శంకరం ఒక రోగిని చూడటానికి వెళ్లాడు. అంతకు ముందు ఆరోగి టైఫాయిడ్‌తో బాధ పడ్తున్నాడు. ఆనందయ్యగారి మందులతో తగ్గి పథ్యంకూడ పుచ్చుకొన్నాడు. యింతలో యింట్లో వాళ్లకి తెలియకుండానే నోరుచవి చచ్చి యింట్లో అటకమీదవున్న వేరుశనక్కాయలు తెచ్చుకొని గప్ చుప్‌గా తిని మంచంక్రింద పడేశాడు. యింకేం సాయంత్రానికి జ్వరం తిరగబెట్టింది. వెంటనే ఆనందయ్యగారికి పిలుపువచ్చింది. ఆయనరోగి నాడి పరీక్షించి "అబ్బాయ్! నివేమైనా చెడు పదార్థాలు తిన్నావా?" అని ప్రశ్నించాడు రోగిని. "ఎబ్బే లేదు" అన్నట్లు తలవూపాడు అతడు. తిన్నానంటే డాక్టరు కోపపడతాడేమోనని.

ఆయన మళ్లీ అటు, యిటు చూచి "అబ్బాయ్, నీవు అబద్ధం చెప్తున్నావ్?

వేరుశనక్కాయలు తినలేదా ?'' అన్నాడు బిగ్గరగా. ''తిన్నానండీ;'' అని అతడు నిజం వొప్పుకొన్నాడు. యింట్లో వాళ్లు గూడ 'ఎలా డాక్టరుగారు తెలుసుకొన్నారు' అని ఆశ్చర్యపోయారు. అంతకంటె ఆశ్చర్యపోయాడు శంకరం. సరియైన మందు యిచ్చి అలా ఏవి తినకూడదని హెచ్చరించి యింటికి వచ్చేశారు యిద్దరూ.

ఆ తర్వాత సాయంత్రంపూట తీరికగా యిద్దరూ కూర్చునివుండగా తను ఎంతో సేపటినుండి అడగాలనుకొన్న విషయాన్ని బయట పెట్టాడు శంకరం-''డాక్టరుగారూ! మీకు జ్యోతిష్యంకూడా తెలుసాండీ?''

''తెలియదే ఏం ?'' అన్నాడు ఆయన. ''అదికాదండీ మరి ఆరోగి వేరుశనక్కాయలుతిన్నాడని ఎలా చెప్పగలిగారండీ ?'' అన్నాడుమళ్లీ.

''ఓ! అదా! నాడిచూస్తే నీరసంగావుంది. తిరిగిజ్వరం రావటానికి కారణం ఏదో పదార్థం తినివుండాలి. ఆదేసమయంలో అతని మంచం క్రింద శనక్కాయలపొట్టు కనిపించింది. అందుకే చెప్పాను.''

యింతలో జమీందారు గారి అబ్బాయికి జ్వరం తగిలిందని డాక్టరుగారికి కబురు వచ్చింది. ఇక నేం శంకరం ఆ అవకాశాన్ని వినియోగించుకోదలచాడు.''డాక్టరుగారు నేను చూచి మందుయిచ్చివస్తానండీ! ''అన్నాడు. ఆయన 'సరే పోయిరా' అన్నాడు.

శంకరం వెళ్లి రోగినాడి చూచాడు. నీరసంగా వుంది. ఆపిల్లవాన్ని ఎగాదిగా చూచి ''అబ్బాయ్ ! నీవు ఏమైనా చెడు పదార్థాలు తిన్నావా?'' అన్నాడు. ''ఉహూ తినలేదు'' అన్నాడు శంకరం ముఖంవంక చూస్తూ. ఆ పిల్లవాడి తల్లి దాసీ వాళ్లుకూడ ''లేదండీ తినలేదు'' అన్నారు.

ఒక్కసారి అన్ని వైపులా పరకాయించి శంకరం చూచాడు. ఏమీకన్పించలేదు. కండ్లు మంచం క్రిందను వెళ్లాయి. అక్కడ జమీందారుగారు వేటాడిన పులి తాలూకు చర్మము పడివుంది. యికనేం శంకరం ''అబ్బాయ్ ! నీవు అబద్ధం చెప్తున్నావు. నిజంగా నీవు పులిని తిన్నావు. యిదిగో తోలు'' అంటూ మంచంక్రింద పులిచర్మాన్నిలాగి వాళ్లకి చూపాడు. అక్కడి వాళ్లంతా శంకరం తెలివితక్కువకు విరగబడినవ్వారు. పాపం! శంకరం అక్కడ ఓక్షణంకూడా నిలబడకుండా యింటి ముఖం పట్టాడు.

---

# పెద్దల మాటలు

శ్రీ చామర్తి సుబ్రహ్మణ్యం

పూర్వం గోదావరీ తీరాన్ని ఒక భయంకరమైన అడవి ఉండేది. దాని సమీపంలోనే ఒక పెద్ద పర్వతం ఉండేది. ఆ పర్వతమునుండి బహు నిర్మలమైన ఓసెలయేరు ప్రవహించేది. ఆ భయంకర అడవిలో పెక్కు భయంకర మృగాలు నివసిస్తున్నాయి. అందొక పర్వత గుహలో ఒక సింహరాజము భార్యా బిడ్డలతో కాపురముంటోంది. ఆ సింహ దంపతులకు ఇద్దరు బిడ్డలుంకలరు. అవి తమబిడ్డలిద్దరినీ అతిగారాబముగా పెంచసాగాయి.

ఆ సింహపు పిల్లలు తమ తల్లితండ్రులతో కలసి అరణ్యంలోనికి విహరించడాన్కి బయలుదేరినపుడు, ఆ అరణ్యంలో ఉండే ఇతర మృగాలన్నీ పారిపోతూండేవి కాని ఆ సింహదంపతులు తమ పిల్లల్ని తమతో కూడా అధికంగా తీసుకువెళ్ళక ఆ గుహలోనే విడిచి ఆహారంకోసం అరణ్యములోనికి పోతూండేవి.

మాటికి మాటికి ఆ సింహదంపతులు, తమబిడ్డల్ని పిలిచి, "మీరు పొరబాటునైనా సరే మేములేనిదే ఒంటరిగా బయటకు పోవద్దని" పలుమారులు నచ్చజెప్పేవి. తల్లితండ్రుల మాటలను చిన్నసింహపుపిల్ల అనుసరించేది. కాని పెద్దదానికి ఆ విషయం ఎంతమాత్రమూ బుర్రకెక్కేదికాదు. ఓరోజున ఆ రెండు సింహాలూ ఆహారంకోసము అరణ్యములోనికి పోయాయి. అపుడు పెద్దసింహపుపిల్ల చిన్నదానిని పిలిచి ఈ క్రిందివిధంగా పల్కింది. "నడు; నాన్న అమ్మ, ఆహారంకోసం అడవికి పోయారు. కనుక కాస్సేపు సర్దాగా సెలయేరు ప్రాంతానికిపోయి చల్లని నీటిని త్రాగివద్దాం. ఆ తరువాత కొంచము సేపు అడవిలో విహరించివద్దాం. అచ్చట ఉండే లేళ్ళను భయపెట్టడమంటే నాకు చాలా ఇష్టం. కనుక త్వరితముగా తిరిగివద్దాం. నడు", అని పల్కినది.

పెద్దదాని మాటలువిని చిన్నసింహపుపిల్ల పెద్దదానితో ఈ క్రిందివిధంగా నీతినిబోధించింది. 'వద్దువద్దు' అందులోనూ ఒంటరిగా వెళ్ళవద్దని, అందులో సెలయేరు ప్రాంతానికి అసలే వెళ్ళవద్దని, నాన్నగారూ, అమ్మగారు మనకెన్నోసార్లు చెప్పారు. అందుచేత కాస్సేపాగు. నాన్నగారు, అమ్మగారు వచ్చినతరువాత వాళ్ళతో కలసివెళ్ళి ఆ చల్లని నీటిని కడుపారా త్రాగివద్దాం" అని పల్కింది. అపుడు పెద్దది, చిన్నదానితో "నాకు చాలా దాహంగా ఉంది. అదీగాక ఈ అరణ్యంలో సంచరించే మృగాలన్నీ మన సింహజాతికి భయపడుతూంటే, వాటికి మనం భయపడడమెందుకూ ?" అని చిన్నదానితో కోపంగా పల్కింది. చిన్నపిల్ల ఒంటరిగా అడవిలోనికి పోవడాన్కి సిద్ధపడలేదు. పెద్దదానితో మరల చిన్నది చెప్పసాగింది. "నేను తల్లితండ్రుల మాటను జవదాటను, మనము చాలా చిన్నవారము, మన మితరులను ఏమీ చేయలేము. కనుక ఒంటరిగా అడవికిపోవటంలో నాకు భయమేస్తుంది" అని పెద్దదానితో చెప్పింది. చిన్నదాని మాటలువిని కోపముతో కూడినదై ఈ విధంగా పల్కింది. "నీవు పిరికిపందవు, నీవు రావద్దు. నేను ఒంటరిగా పోతున్నాను" అని పలికి, తల్లితండ్రుల మాటలను త్రోసిపుచ్చి, సెలయేరు దగ్గరకు వెళ్ళింది. అది అక్కడ కడుపునిండా చల్లటినీరును త్రాగింది. అచ్చట కొంచెముసేపు విశ్రమించింది. ఇక లేళ్ళని అన్వేషించడాన్కని అటూ ఇటూ తిరగ నారంభించినది.

ఈవిధముగా ఆ సింహపుపిల్ల అచట తిరుగాడుచుండగా ఆ రోజునే, ఆ ప్రదేశమునకే కొంతమంది వేటగాళ్ళు వచ్చారు. వేటగాళ్ళు దూరాన్నుంచే ఒంటరిగా సంచరించుచున్న పెద్దసింహపుపిల్లను చూచి, వారు ఈ క్రిందివిధముగా తలపోసారు. "మనము

దాన్ని పట్టుకొని మన మహారాజుగారికి కానుకగా ఇస్తే మనకు మంచి బహుమానము లభిస్తుం”దని, భావిస్తూనే, వారు నెమ్మది నెమ్మదిగా నాలుగు మూలలకూ సర్దుకొని అదివచ్చుదారినిగాంచి జాలం పన్నేరు. ఆదారినే వస్తున్న సింహాపుపిల్ల జాలంలో చిక్కుకుపోయింది. ఆ పెద్ద సింహాపుపిల్ల జాలంనుండి తప్పించుకోలేక గిలగిలా తన్నుకోడం ప్రారంభించసాగింది తమవలలో చిక్కిందన్న ఆనందంతో వారు జాలముదగ్గరకువచ్చి దానిని పట్టుకున్నారు.

పాపం, ఆ సింహాపుపిల్ల ఏంచేస్తుంది. అది ఇంకా కుసకేమంత పెద్దదైనా కాలేదు. ఆసింహాపుపిల్ల ఇక ఏమియూ చేయలేకపోయింది. వారు అది గిలగిలా కొట్టుకోకుండా, గట్టిగా తాళ్ళతో గట్టిగా కట్టేశారు. అది గట్టిగా శ్వాసపీల్చుకోడానికైనా అవకాశం చిక్కటంల్లేదు.

వేటగాళ్ళు దాన్ని సరాసరిగా రాజ్యానికి తీసుకుపోయి మహారాజుకు సమర్పించారు. మహారాజుగారు దాన్ని చూచి, చాలా ఆనందించారు. ఆ సింహాపు పిల్లను పట్టిన వేటగాళ్ళకు చాలా వరహాలు కానుకగా నిచ్చారు. వాళ్ళు ఆ కానుకలను స్వీకరించి ఆనందంగా వెళ్ళిపోయారు. మహారాజుగారు దాన్ని తీసుకుపోయి బోనులో పెట్టేశారు. పాపం అది చాలా దుఃఖించసాగింది. అప్పటికి దానికి తనతల్లి తండ్రులు చేసిన హితభోద జ్ఞాపకమొస్తూండేది. బాగా ఆహారం లభించినప్పటికి స్వేఛ్ఛగా విహరించే అవకాశంలేదు దానికి. మాటిమాటికీ ఆ బోనులోనుండి గర్జిస్తూ ఆ ఇనుప ఊచల్ని తన పంజాతో విరగకొట్టాల్ని ప్రయత్నిస్తూండేది. కాని ఆ ఊచలు అంతలో విరిగేవికావు.

ఈ విధంగా అది రోజులను గడపసాగినది. ఆ సింహాపుపిల్ల తన ఎదురుగా ఓచిన్నపిల్లవాడెవడైనా అటువస్తే వాడినిచూచి గట్టిగా గర్జిస్తూ గంతులువైచేది. ఒకవేళ ఎవరయినా దానిభాష నర్థముచేసుకుంటే, దాని అభిప్రాయం, ఆవశ్యం ఇదిఅయి ఉండాలి. “ఓబాలుడా! నీవు ఎల్లప్పుడు పెద్దల మాటలు వినుము. వారిమాట ప్రకారమే ప్రవర్తించు. వారి మాటకనుక ధిక్కరిస్తే ఆపదలొచ్చినతరువాత పశ్చాత్తాపపడుతే ప్రయోజనంలేదు. నేను పెద్దల మాటలు వినకపోవడంవల్ల ఇచ్చట బంధించబడి దుఃఖముతో కాలము గడపుచున్నాను.” అని అనుకొనేదట, తన మనసులో. “ఏం! బాలలూ! ఆ సింహాపుపిల్ల మాటలు నిజంకాదంటారా?”

—(o)—

## “పొద్దుటే ఎవరిమొహాం చూచానోగాని”

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

సాధారణంగా ఏదన్నా ప్రమాదంగాని పోట్లాటగాని, మరేలాటి విపరీత సంఘటన జరిగినా “పొద్దుటే ఎవరి మొహం చూచానోగాని, ఇలాగ జరిగింది” అనుకుంటూంటారు చాలామంది.

మనకుఎటూ శకునాల పట్టింపు ఉండనే ఉందిగా! ఇక ఏదన్నా దుస్సంఘటన జరిగితే చెప్పాలా. ఆరోజంతా పొద్దుటే ఎదురైన వాణ్ణి తిట్టితిట్టి తూరు పారపోస్తాము. ఇది సాధారణంగా ప్రతివారికి తెలుసుగా.

ఇలాగే ఒక రాజుగారు ప్రొద్దుటేలేచి జలకాలాడటానికని తోటలోనున్న

(276 వ పేజి చూడుడు)

# అగ్నిజ్వాలలు

మూలం : శ్రీ భైరవ ప్రసాదగుప్త

అనువాదం : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

"రాధా ! రాధా ! అరే నువ్వేదైనా కలగంటూన్నావా?" అంటూ శశి, రాధ కంపితమోవిని చూసింది.

"లేదు లేదు" చకితయైపలికింది రాధ. "కాస్త బద్ధకంగాఉండి నడుంవాల్చేసరికి నిద్రవచ్చేసింది."

"క్షమించు అక్కా! నీకు నిద్రాభంగంకలిగించాను. నీవునిద్రిస్తున్నావని తెలిస్తే వచ్చేదాన్ని కాదు."

"ఫర్వాలేదులే. కూర్చో" స్వప్నభంగానికి బాధపడతూనే ఆహ్వానించిందిరాధ.

"అక్కా ! నువ్వుసాయంత్రం టీకివస్తావా ?" అంటూ ప్రశ్నించింది శశి రాధ ప్రక్కకూర్చుంటూ.

"ఎక్కడికి ?" అంది రాధ ఏమి ఎరగనట్లు

"భేష్ ! బాగుంది. అప్పుడే మర్చిపోయేవా ? జగదీశ్ నిన్నుమరీ ......" "శశి ! నేను రాను." రాధ మనస్సులోని దొంగసమాధాన మిచ్చింది.

"బలే దానివే పాపం జగదీశ్ నిన్నెంతో పిలుస్తే రానంటావా ?అలా ఎవరైనాచేస్తారా ?" "నేనేం వస్తానని వాగ్దానంచెయ్యలేదే" ఆ విషయాలమీద తనకట్టే యిష్టంలేనట్లు మాట్లాడుతోంది రాధ.

"అక్కా! నే వాగ్దానంచేశాను. నువ్వు తప్పక రావాలి" రాధ వదనాన్ని గాంభీర్యంగా చూస్తూ పల్కింది శశి.

"శశీ ! నువ్వువెళ్లు నాకు రావడంయిష్టంలేదు." అయిష్టతను తెలియజేసింది రాధ.

"అక్కా ! నీకన్నులో కన్నుకలిపి నిద్రించగల యువకుడు ఉండడని నాకు తెలుసు. ఆసాహసానికి పూనుకోడం ఎంతసాహసం ? జగదీశ్ యింటికి రావడానికి నీకు అభ్యంతరం ఏమిటి ? కాస్త వాగ్దాన గౌరవానైనా కాపాడు. వస్తానని చెప్పు"అనునయంగా పల్కింది శశి.

"చెల్లీ ! నా ఆరోగ్యం"......

"ఏంలేదు. అక్కా నువ్వురాక తప్పదు. నామాట విను 5 గంటలకి వెడదాం. ఏం ? డ్రైవరుతో చెప్పివస్తా" అని రాధ మాట్లాడ్డాని కవకాశమీయకుండా శశి వెళ్లిపోయింది.

రాధ నీడలో శశి తన అసఫలపురాతనగాధను సఫలీకృతం చేసికోయత్నిస్తోంది. ఆ కధకి రాధ ఓపాత్రగా నటించింది. రాధ తనకనులలోని కఠోరతతోనే నవ్వుతూనే బయలుదేరింది.

జగదీశ్ రాధను పొగడ్తూనంతసేపూ ఆమె మారు మాటాడక ఇహాన్ని మరచి ఆనందిస్తూంది. ఏమనాలో, ఏంచెయాలో ఆమెకి తెలియటంలేదు. జగదీశ్ కలుసుకున్నపుడల్లా రాధను పొగుడుతూనే సంభాషణ ప్రారంభిస్తూన్నాడు.

నాడు మూడోపిరడ్ ఖాళీ. రాధ లైబ్రరీలో ఓ మూలగా కూర్చుని ఏవో పత్రికలు తిరగేస్తోంది. ఏవైపునుంచి, ఎంతసేపైవచ్చాడో జగదీశ్ ఆమెకు తెలియదు. అటూ ఇటూ చూసి నెమ్మదిగా అన్నాడు.

"మీకు కాళీయేనా ?"

"అవునండి" రాధ పేజీలతిరిచూస్తూనే సమాధానమిచ్చింది.

"అయితే కాస్త టీ త్రాగివద్దాంరండి. రెస్టారెంట్ దగ్గరేఉంది. పదినిముషాల్లో తిరిగిరావచ్చు" కోరికూడా అతనికోరికను సాధారణంగా ఎవరూ తిరస్కరించరు.

రాధ సమాధాన మివ్వలేదు.



3

"ఆలస్యమవుతుందని బాధపడకండి. ఇక్కడ నా మాట రాజ్యమేలుతుంది. మీకేంఫర్వాలేదు."

జగదీశ్ అట్టే మాట్లాడవలసిన అవసరంలేకుండానే ఆమె అతనిననుకరించింది. అతన్ని బాధించడం రాధ కెంతమాత్రం యిష్టంలేదు. అయినా వెళ్ళడంతప్ప దన్న సంగతి ఆమెకు తెలుసు.

అలా ఒంటరిగా జగదీశ్ ప్రక్కగా కూర్చోడం రాధకదే ప్రథమం. సిగ్గుతో ఎఱ్ఱబారి వణికి పోతోంది. స్వరంలో కంపన బయలుదేరింది. ఆస్థితిని మార్చాలని సర్వవిధాలా ప్రయత్నించి విఫలురాల యింది.

కావలసిన ప్లేట్లూ టీ పెట్టి కర్టెన్ లాగి హోటల్ కుర్రాడు వెళ్ళిపోయాడు.

"తినండి" అన్నాడు అసంకల్పితంగా ఆమెకేసి చూస్తూ. "నాకేం వొద్దండి. సరదాగా మీతో వచ్చాను." ఆమె పలుకులోని వొణుకుని జగదీశ్ గుర్తించి నవ్వుకున్నాడు.

"ఊరికే సరదాగా వచ్చారు గనుక సరదాగానే తినండి" అంటూ ఓ కేకుతీసి ఆమెకివ్వబోయ్యాడు.

"ఒద్దండి. వద్దు" అంది సిగ్గుతో రాధ. "చూడండి నేను చాలా సరదామనిషిని. మీరు దీనిని తినక పోతే నేనే తినిపించవలసివస్తుంది.

అలా చేస్తే మీరు తినక తప్పదు. అంచేత... ... అంటూ నేకేకుఉన్న చేతిని ఆమెవైపు పోనిచ్చే సరికి రాధ అతనిచేతులలో నుంచి కేక్ తీసు కొంటూ మీరు చాలా పట్టుదలగలవారే" అంది రాధ నవ్వుతూ. "పట్టుదలగా వుండకపోతే పనులు జరుగవు రాధాదేవిగారూ." అంటూ మరో కేక్ తీసాడు. తినాలనిలేకపోయినా రాధ ఆ పని పూర్తిచేసింది.

"చూడండి రాధాదేవిగారూ! నేను చాలా కాలంనుంచి మీతో ఏకాంతంగా మాట్లాడాలను కుంటూన్నాను" అతని సంభాషణ గంభీర రూపందాల్చింది.

రాధ శరీరమంతా వణికిపోయింది. ఆమె సిగ్గుతో తల బాగా వంచుకొని నేలనుచూడసాగింది.

"నేనో విషయం చేస్తాను, మరోలా భావించనంటే" అస్వాభావికంగా పల్కాడు జగదీశ్ "మీకు నే ముందుగానే చెప్పాను. నేను చాలా సరదామనిషిని- నేను ప్రతివిషయం ముందుగానే తెలుసుకుంటాను. నా విషయమై తెలుసుకోదలచుకుంటే సుధనడగండి" అంటూనే రాధకేసి చూసాడు. ఆమె భావం తెలుసుకోవాలనే ఉద్దేశంతో.

రాధ మరింతసిగ్గుతో తలదించుకుని కాలిబొటన వ్రేలితో నేలమీద ఏదో రాస్తోంది. జగదీశ్ మాట లామెకు నచ్చకపోలేదు. అలానే ఓ సారి ఓరకంట జగదీశ్ కేసి చూసింది.

జగదీశ్ చిరునవ్వు నవ్వాడు. మరుక్షణంలో మరింతగాంభీర్య మనస్కుడై "—రాధాదేవిగారూ! నా హృదయగతభావం ఒక్కమాటలో చెప్పా లంటే నాకు మీమీద ప్రేమకల్గింది. మీ మనస్సులో నా విషయమైన భావం ఏదైనా కల్గిందా?" అంటూనే మేజమీద ఉన్న రాధచేతులమీద తన చేతులు పెట్టాడు.

ఏంచెప్పాలో ఏంచెయ్యాలో రాధకి తెలియటం లేదు. ఆమెహృదయం దడదడ కొట్టుకోసాగింది. ఒక్కక్షణం అక్కడ కూర్చోడంకూడా చాలాకష్ట మనిపించింది. తనవణికేచేతిని లాక్కుంది నెమ్మదిగా.

"చూడండి నేను మొదటే మీ భావాన్ని తెలుసుకోవాలనుకున్నాను. నామీద మీకు ప్రేమ లేకపోతే నేను మీకై బాధపడేవ్యక్తినిగాను. ఏదో ఒకటిచెప్పండి." ఆమాటలలో నిజంగా అతని హృదయమే తొంగిచూసినట్లనిపించింది రాధకి.

"నేనేం చెప్పనో చెప్పండి. నేను సమాజానికి లొంగినదాన్న. మీరుకూడా..."

"లేదు మీరు పొరబడుతున్నారు. నా విషయమై మీరలాంటి భావాలేమీ ఉంచుకోవద్దు? ఒక సారి నోటినుంచి వచ్చినమాటతో నా హృదయం కూడా వస్తుందని తెలుసుకోండి. తరువాత పెద్దింటి బిడ్డల్లా నన్ను జమకట్టకండి. ఇలా ఓయువతితో మాట్లాడ్డం నాకిదే ప్రథమం." జగదీశ్ హుషారుగానే మాట్లాడుతున్నాడు. అయినా రాధ కాతనిపలుకులలో గాంభీర్యంగోచరిస్తోంది.

"సరే యింకలెండి. టైమైంది కాబోలు" అంటూనే లేచిందామె.

"ఇంకా పదినిముషాల టైముందండీ" అన్నాడు. వాచీ చూచి "కాస్సేపు కూర్చోండి. ఈ టీ చల్లారిపోయింది. మరో టీ తెప్పించనా?"

"నేను త్రాగను మీరు త్రాగండి" అంది కుర్చీ మూలగా మొహం పెట్టి.

"మరి యీ కేక్! మీరు తినకుండా వదిలేసారూ? తీసుకోండి." అంటూ మరో కేక్ తీసి రాధవైపు చేతిని పోనిచ్చాడు. రాధ అంది పుచ్చుకోవాలను కుంది. కాని జగదీశ్ పెదవికందించాడు.

జగదీశ్ రాధలసంభాషణలశ్రుతి మించిపోతున్నదని — సుధ శశికిచెప్పింది. ఏరోజు రిపోర్టు ఆరోజు తుచతప్పకుండా శశికి చేరుతోంది. తనసర్వవిషయాలు సుధకి చెప్పకుండా జగదీశ్ ఉండలేదు. శశి హృదయం తన సర్వవిషయాలు సుధకి చెప్పకుండా జగదీశ్ ఉండలేదు. శశిహృదయంలో అగ్నిజ్వాలలు చెలరేగాయి. రాధతో మాట్లాడుతూన్నంతసేపూ తనకేమీ తెలియనట్లు నటిస్తూ వచ్చింది. అనుమానాలను దృఢపటుచుకునేదాకా ఆమె రంగంలోకి దిగదు.

ఆనాడు లీజర్ లో శశి రాధ గరల్స్ వెయిటింగ్ రూమ్‌లో ఉండగా జగదీశ్ వచ్చాడు. వస్తూనే ప్రారంభించాడు" రాధాదేవిగారూ! ఒకవారం లోగా సంచికకు కావలసిన మేటర్ యివ్వమని ప్రొఫెసర్ గారు చెప్పారు. కాస్త మీకథ త్వరగా పూర్తి చేసియిస్తారా ?"

"నేనింకా ఏమీ వ్రాయలేదండీ," రాధ చిరునవ్వుతో శశి కళ్లల్లోకిచూస్తూ సమాధానమిచ్చింది.

ఆ పలుకుల్లో శశికథలు వ్రాస్తుందనే విషయం మీద తనకు విశ్వాసంలేదన్న విషయం గోచరిస్తోంది.

"అవునండి. ఏవో చిన్నచిన్నకథలు వ్రాస్తూంటాను." తల క్రిందకు దించి కనులుపైకెత్తి సమాధానమిచ్చింది శశి.

"లేదండీ! మాశశి బాగా వ్రాస్తుంది కాని ఎప్పుడూ పత్రికలకి పంపదు." గంభీరంగా మాట్లాడిందిరాధ. ఆమాటలను శశి వ్యంగ్యంగా తీసుకుంటుందేమోనని భయపడుతూనేఉంది.

"అయితే మీరు కూడా ఓ కథవ్రాసి యివ్వండి" అని వెళ్ళిపోయాడు జగదీశ్.

ఐదురోజుల కఠినపరిశ్రమ ఫలితంగా కథపూర్తి చేసింది రాధ. కథపేరు (ఆసరా) పెట్టింది. అంత పరిశ్రమచేసి ఇదివరలో ఏకథా వ్రాయలేదు. నిజంగా ఆ కథ వ్రాయడానికి ప్రాణాలతో యుద్ధంచేసినట్లనిపించింది. ఈ కథప్లాటు కూడా చాలా బాగుంది. నేను రాధ తన కథను పదే పదే చదువుకొని ఆనందించసాగింది. "జగదీశ్ ఈ కథచదువుతాడు అతని దృష్టిలో తను ఎంత ఔన్నత్యంగా కనుపించాలి" అనుకుంది రాధ. అలా ఆనందిస్తూండగా ......

పెద్ద తుఫానులావచ్చింది శశి. వస్తూనే రాధవడిలో తలపెట్టుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆనందంతో ఎగిరే పక్షికి దెబ్బతగిలి క్రిందపడే బాధననుభవించిందిరాధ. తేనువ్రాసిన కథ నోమూలపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తూన్న శశి బుజాలు పట్టుకుని "శశీ! ఏంజరిగిందే? ఎందుకలా ఏడుస్తావు" అంది బాధగారాధ.

"అక్కా నాకథ యింకా పూర్తికాలేదే" ఏడుస్తూనే శశి సమాధానమిచ్చింది.

రాధకి నవ్వొచ్చింది. "అయితే యిప్పుడు వచ్చిన

ప్రమాదం ఏమిటి ?” ఓదారుస్తూ రాధ పల్కింది “ప్రపంచంలో కథలు వ్రాయడమే నా మహత్కార్యం.”

జగదీశ్ ఏమనుకుంటాడు. నేను అబద్ధాలకోరు ననీ హడావుడి తప్ప ఏమీ చేయలేననీ అనుకుంటాడు. నేను కథ ఇస్తాననికూడా చెప్పాను” అంది బాధగా శశి.

“ఆయనతో నువ్వసలెందుకు చెప్పావు. నువ్వు కథలు వ్రాయలేవని నీకు తెలియదా ?”

“అయితే అక్కా మరి నువ్వాయనదగ్గరనెన్నెందుకు పొగిడావు? ఇంక నేను నా ముఖం చూపగలనా ?”

ఆపలుకులో చాలా వేదనకనుపించిందిరాధకి.

“నేనాయన్ని ఒప్పిస్తాలే దానికోసం నీవు విచారించకు” శశి వీపునిమురుతూ వచ్చే నవ్వు నాపుకుంటూ పల్కింది రాధ.

“వద్దురాధా! వద్దు” మళ్ళీశశి రాధవడిలో కూలి ఏడవసాగింది.

“ఏంటే శశీ ! అనవసరంగా విచారిస్తావు. యీ పరిస్థితిలో చేయగలదేమిటి? ” వివశురాలై పల్కింద రాధ.

“నీకోసం చెయ్యలేనిదేముంది. నాకు చేతనైనంత వరకూ చేస్తాను.” శశిని శాంతపరచాలనే ఉద్దేశంతో సమాధానమిచ్చింది రాధ.

‘అక్కా ! నీకోసం నేనేదైనా చేస్తాను. ఆనాడు నాన్నగారు నీ చదువుమానిపిస్తే... నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీకనే చెప్పక్కర్లేదు. నా కోసం ఓ చిన్న పనిచేయలేవూ! ”అంటూ చంటిపిల్లాడిలా ఏడుస్తూ మాట్లాడింది శశి. రాధని కావలించుకుని.

“అదేమిటో చెప్పు శశీ !” అంది శంకిస్తూనే.

“చేస్తావుకదూ” కాలినయినుమును మరింత వేడిక్కించాలన్న ఉద్దేశంతో పల్కింది శశి.

“నావల్లనైతే, చెయ్యనని శంకించడం వ్యర్థం” భయపడుతూనే మాట్లాడింది రాధ

“నీవల్ల తప్పకవుతుంది.” రాధని మరింత గట్టిగా కౌగలించుకొని పల్కింది శశి.

“అయితే చెప్పు” విసుగ్గా పల్కిందిరాధ

“అక్కా ! నిన్ను బిక్ష మడుగుతున్నాను నీక్రొత్తకథ నాకియ్యి” అని శరవేగంతో రాధను విడిచి వెళ్ళిపోయింది.

శశిపలుకులు రాధ చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. రాధవివశయై చెవులమీద చేతులు పెట్టుకొని తనలో లోపల అరచుకొంటూ వీల్లేదు... వీల్లేదు ... నేనల్లా చెయ్యను ... చెయ్యలేను.

కాని అలా అన్నంతమాత్రాన ఏం జరిగేనూ ! ఏమి జరగక పోవడము మాత్రము జరగకపోవచ్చు శశి మాటలు అంగీకరించకపోతే ... ... పోతే ... పోతే.

ఆయింట్లో శశి తప్ప రాధ మీద సహానుభూతి చూపేవ్యక్తులెవ్వరూ లేరు. పినతండ్రీ - పినతల్లికూడ రాధని అనవసరముగా భరిస్తూన్నామని బాధపడుతునే ఉన్నారు. అటువంటప్పుడు శశికి కోపం తెప్పిస్తే తన చదువుకి స్వస్తి చెప్పాలని రాధకి తెలియకపోలేదు. అంతే కాకుండా పినతండ్రి తనను ఓ ముద్దు చేతుల్లో పెట్టాలనికూడ ప్రయత్నిస్తూన్నాడనే విషయంకూడ ఆమెకు తెలును. పినతండ్రి ఆ సదవకాశంకోసమే నిరీక్షిస్తూన్నాడుకూడా.

రాధ పరిస్థితులకు వ్యతిరేకంగా ప్రవర్తించ వీల్లేదు. ఒక్క ‘కథ’ యిక్కడ జీవితానికి సవాల్ అయి కూర్చుంది. కథ ...... అవును. కథయే. తన కథలోని ప్రతీ శబ్దం హృదయాంతరాళంలో రక్త బిందువులతో నిర్మించబడ్డది. గాంభీర్యమైన అంతరాత్మలోంచి వచ్చింది కథ. ఆకథ వ్రాస్తూనంతసేపూ నుదుటిమీదగా చెమట బిందువులు తళతళ మెరుస్తూ అంతలో జలజలధారగా ప్రవహిస్తూనే ఉన్నాయి. ఆ కథ తన జీవితానుభూతులకాగారి. తన సర్వస్వంకూడాను. ఆ ధనాగారంలోని ఒక్క పరమాణువునుకూడా స్వహస్తాలా - మనసారా శశికీయలేదు.

(సశేషము)

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౭౫

కమలలోచనుఁడ! జాగ్రత్స్వప్నసుప్తుల
యందుఁ బ్రకాశించునట్టి, జ్ఞాన
తత్త్వరూపుండవై - ధాత్ర్యాది, పంచభూ
తాత్మకుండగుచుఁ గోదండరామ!
'శాంభవీ' మొదలు, ప్రశస్తయోగముల
తోఁ
గూడుకొన్నావు; మిక్కుటముగాగ
సాంఖ్యతత్త్వములకుఁ జాల దూరంబీవు
సత్యంబు, శబ్దగోచరుఁడుగావు
జన్మనాశనములు లేవు; సతము, చేత
నా స్వరూపుఁడైనట్టి, యానందుఁడీవు!
ఆది వ్యాధులు లేసి యాద్యంతుఁడీవు!
శరణు వేడెద-శ్రీరామ చంద్ర నిన్ను!

౭౬

కేకిపత్రోత్తుః-నీకలంకారముల్
ముక్కున ముత్యంబు ముద్దునీకు!
పీతాంబరము నీకుఁ బ్రియమైన పుట్టంబు
కౌస్తుభమణియు, చక్కఁదనమ్ము
గద, పాశ వేణువుల్ - కమ్మనియిక్షు చా
పము, పుష్పబాణముల్ బరగఁగల్గి
నవ మన్మథుండవై - నందనందనుఁడవై
శ్రీరామ మూర్తివై చెలఁగినావు
క్రొత్తపవడంబు రీతిఁదళ్కొత్తుచుండు
దేహమును దాల్చినాడవు! మోహనాంగ!
కమలనయన! షట్కోణ చక్రంబునందు
వాసమొనరించుచున్నావు వందనములు.

౭౭

సాకేతపురమందు - సర్వజగన్మోహ
నాకారుఁడైన, శ్రీనాథమూర్తి
రత్నాంకిత స్తంభ రాజసహస్ర, మం
టప, మహాసింహాసనమునఁ బద్మ
చక్రంబు నందధిష్ఠానుఁడై, వ్యాస, గౌ
తమ, వశిష్ఠాదులు దన్నుఁగొలువ
దిక్పాలకులు, బ్రహ్మదేవుండు, రుద్రుండు
లక్ష్మణానుజుఁడు, సలక్షణముగఁ
దన్ను సేవింప, సీతతోఁ జెన్ను మీఱి
చిరతరానంద మగ్నుఁడౌ - శ్రీవిలాసు
రామభద్రుని సతతంబు రక్షకొఱకుఁ
ప్రార్థనమొనర్చి సేవింతు భక్తితోడ

౨౮

హృదయ పద్మమునందుఁ బొదలియున్నావు;
చం
ద్రాకృతి తోడ, శ్రీరామ చంద్ర!
సూర్య చంద్రాగ్నులఁ జుట్టి, పై భాగంబు
నందు, షోడశ చక్రమందు. నీవు
తారకరామ! నాదబ్రహ్మమధ్యంబు
నందు, జానకిఁగూడి సుందరముగ
వెలయుచునున్నావు; విశ్వేశ నక్షత్ర
మంటపమందు, సూక్ష్మాకృతిని, ధ
రించియున్నావు, నిదు చరిత్రమరసి
తత్త్వ సూక్ష్మంబుఁదెలిసిన తజ్ఞులొకరె
వారు నీ భక్తవర్యులు ప్రభువరేణ్య!
దాశరథి! కరుణానిధీ దండమిదిగో!

౨౯

శ్రీయయోధ్య కలదాశ్రితజన మందార
మచటఁబుష్పయుతమై - హర్ష
మొసఁగు
నందుండు నొక్క యష్టాక్షరపత్రంబు;
పత్రంబు నందు. నక్షత్రనామ
కర్ణిక శోభించు 'గమనీయ మాణిక్య
మంటప మందులో మహిమ వెలయు
నాల్గు వేదంబులు .నాల్గు కుండలముల
కరణి, శోభించుచుఁ గ్రాలుచుండు
మహితమైన, నాదబ్రహ్మ మధ్యమందు
శయ్య. ధ్రువమండలోద్భవ చారు సుధలఁ
దడుపఁబడి, శయనించు' కోదండరామ!
నిన్ను సేవింతు రక్షింపు నీరజాక్ష!

౩౦

శంఖచక్రములు, హస్తమునందుఁదాల్చి పీ
తాంబరము, ధరించి - దార తోడఁ
గూడి, కిరీటంబు కోమరైన హారముల్
భుజకీర్తులనుకల్గి - పొలుపుమీఱి
కౌస్తుభమణిఁదాల్చి - కమలమందాసీనుఁ
డై, సూర్యతేజంబు నాసిఁగాంచి
పాపముల హరించి - పావుకోళ్ల ధరించి
శశివలెఁ దెల్లనై - చారునేత్ర!
న్యాయగుణశీల! రామ! స్వర్ణప్రభలను
మించు మీసముల్మంగురుల్మెలి గోళ్లు
కలిగి వెలయుచు నున్నావు; కలుషహారణ!
రామచంద్ర! రక్షింపుమా! రాజవదన!

౩౧

శ్రీ, వసాంతాక్షర - చెలువంబుఁగల్గిన
నాల్గు పత్రముల, కోణమున, యంత్ర
మందు, భూతత్త్వంబునంది, చెలంగు, ప
ద్మంబున, శ్రీరామ! డంబుగాగ
కరి, తురగములపై - సురుచిరానందుఁడై
కూర్చున్నవాఁడవు కోమలాంగ!
అభయంబు, పాశంబు, నంకుశమునుగల్గి
పవడంపుకాంతిచేఁ బ్రభలఁజెంది
రామ! శోభించుచున్నావు; రక్తితోడ
నిన్ను ధ్యానించువారికి నెమ్మనమున
చింతలుండవు; సర్వేశ! శ్రీనివాస!
రక్షణము సేయుమయ్య! శ్రీరామచంద్ర!

(సశేషము)

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(ఫిబ్రవరి సంచిక తరువాయి)

వేద వాఙ్మయమున ఉపనిషత్తులకుగల స్థానము, ఉపనిషత్తులు తెలుపు ఉద్దేశముల, ఉపనిషత్తులు తెలుపు సాధనములనుగూర్చి విస్తారముగ విచారించి యున్నాము. ఇపుడు ఉపనిషత్తులు బోధయందుగల శైలిని విచారించెదము.

భాషాతీతుని తెలుపుటకు వివిధఋషులు చేయగలిగిన ప్రయత్నములు ఉపనిషత్తులుగ అవతరియున్నవి. ఈ కార్యమునకై వారు శాంతముతో పరిశ్రమజేసి, సంస్కృతమనబడు రమ్యమయిన భాషను కనుగొనిరి. విపులార్థభావములుగల ఇట్టి భాషకూడ పరమార్థజ్ఞానమును వాక్యములవల్ల వెలబుచ్చలేకున్నది. అయినను, ఇతరభాషలకన్న,సంస్కృతము, అధిక రహస్య విషయముల తెలుపగలిగియున్నది. ఇట్టిశక్తి ఈ భాషయందలి వాక్యముల సూచనలయందు దాగియున్నది.

అందువలన, సామాన్య నవలాగ్రంథములు చదువుటకును, ఉపనిషత్తుల విచారమునకును చాల వ్యత్యాసమున్నది. ఇందుకు సాధకునియందు కొన్ని సుగుణసంపత్తి కలిగియుండవలెను. వాటిసహాయమున మన బాహ్యాభ్యంతర సమరసము ఏర్పడుచున్నది. ఎట్లనిన,

మిత్రులారా! ఈ సాధువుతోడ మీలోకొందరు శుక్లపక్ష ద్వితీయ సాయంసమయమున షికారు వెళ్లుట ఏర్పడెను. అకస్మికముగ చిన్మయునికి నిర్మల ఆకాశమున చంద్రరేఖ కనుబడెను. ఆ సౌందర్య దర్శనము, మీతో పంచుకొన అతడు యుద్దేశించెను. "మిత్రులారా! ఆ సౌందర్యదృశ్యమును గమనించుడు" అని అతడు కేకవేసెను.

కాని, మిత్రులు దానిని కనుగొనలేకుండిరి. వారికి చూడవలెనను కుతూహలమున్నది. అతనికి చూపవలెనను ఉద్దేశమున్నది. కాని, ఆకాశము నిర్మలవ్యాపకముగ నుండుటవల్ల చంద్రరేఖను నిర్దిష్టించుట కష్టముగ నుండెను. మేజాప్రక్కన కుర్చీయుండునట్లు, రేఖ ప్రక్కన వేరువస్తువేదియు లేకుండెను.

కనుక, ఆకాశ ఆవరణమునువదలి వేరు వస్తువు యొక్క సహాయ మపేక్షించవలసి వచ్చెను. ఒక చెట్టు అగుపడెను. "మిత్రులారా! ఆ మామిడి చెట్టును చూడుడు. అందు ఉత్తరపుదిక్కున ఒక కొమ్మయున్నది. కొమ్మచివరన రెండాకులున్నవి. అవి కదులుచున్నవి. కనపడుచున్నవా?"

మిత్రులకు స్వామియందు నమ్మకముండనిచో, వారు స్వామి చంద్రరేఖ నిజముగ చూచియున్నాడని నమ్మబోరు. అతనివల్ల వారికెట్టి లాభమును యుండదు. ఆకాశమునందుండు చంద్రరేఖను చూచుటకు భూమిపైనుండు మామిడిచెట్టుతో నేమి అగత్యమని వారికి తోచినచో, స్వామి తన కార్యమును వదలుకొనవచ్చును.

కాని, మిత్రులకు స్వామియందు నమ్మకముండి, వారు తెలిపిన సూచనలను గమనించగలిగినచో, స్వామితో సహకరించి, హృదయపూర్వక పరిశ్రమతో, మామిడాకులను గమనించ గలిగినచో, చంద్రరేఖ దృశ్యము పిల్లలాటవంటిదిగా నుండును.

అట్లనే, బ్రహ్మ విద్యాగురువులు, మిక్కిలి శ్రమపుచ్చుకొని, మామిడిచెట్టును, అందలి కొమ్మను, కొమ్మయందలి ఆకులను, చూపుచున్నారు. అటు పిమ్మట, "ఎగచూడుము! సత్యము! సమీపముననే గోచరమగును!" అని బోధించుచున్నారు. సాధన ప్రారంభమున అనేక పరస్పర విరోధభావములు

తెలుసుకొనుచున్నాము. సృష్టికారణములు, వ్యక్తిగత అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల వివరములు, అనేక సత్యవాక్యములు, అసత్య వాక్యఖండనములు చూచుచున్నాము. ఇవన్నియు కేవలశిక్షణకొరకు యున్నవి. శిష్యుడు శ్రద్ధాభక్తులతో వివిధవాక్యముల సమ్మతముల విమర్శించుకొలది సత్యమును ప్రత్యక్షముగ అపరోక్షముగ తనయందు తానని తెలుసుకొనగలడు.

అట్టి అపరోక్షజ్ఞానము కలుగుటకు పూర్వమే తాను సత్యమును సందర్శించుచున్నాడు. మనము మామిడి ఆకులను చూచునపుడు మనదృష్టిని నేరుగ చంద్రరేఖవైపు మరల్చియే యున్నాము. చంద్రరేఖ కండ్లకగపడుచున్నది. కాని చంద్రరేఖను మనము గమనించుట లేదు.

చంద్రరేఖను చూచినవ్యక్తి, చూడనివ్యక్తికి, ఆకులవరకు సహాయపడవచ్చును. అటుపిమ్మట అతడు చూడమని బోధించి, విశ్రమించవలసియున్నది. ద్రష్ట తన దృష్టిని ఆకులపై వదలుకొని, ఎగచూడవలెను. అతడు కష్టపడి చూడవలసిన దేమియు లేదు. తనగమనమును ఆకులనుండి వదలుకొనవలెను. ఆకస్మికముగ అప్రయత్నముగ చంద్రరేఖ దృష్టియందుండగలదు. చంద్రరేఖను చూచినవెనుక, సునాయాసముగ ఆకులను చూడవచ్చును. రేఖను చూడవచ్చును!

చంద్రరేఖను, ఆకులకు వ్యతిరిక్తముగ దర్శించునట్లు, సర్వజ్ఞానములకు స్థానమగు జీవకేంద్రమును, ఉపనిషదు ఋషులు మనకు అడుగడుగున దోవచూపుచున్నారు. కనుక వారి వాదములను పూర్ణశ్రద్ధతో అనుసరించినచో, బోధల విమర్శలకు అతీతమును దర్శించ యోగ్యత పొందుచున్నాము.

సామవేదమందలి తలవాకార శాఖయందు, కేనోపనిషదు, తొమ్మిదవ అధ్యాయముగా యున్నది. ప్రతివేదము త్రికాండములు కలిగి యున్నది. మంత్ర బ్రాహ్మణ-అరణ్యకములు-కేన, ఉపనిషదు గనుక, తృతీయ కాండమున కనబడుచున్నది.

తలవాకార శాఖయందలి ఎనిమిది అధ్యాయములు, కర్మ, ఉపాసననుగూర్చి-కర్మయగు యజ్ఞ, యాగములు విధానములు తెలుపుచున్నవి. ఉపాసనలు ఉన్నతధ్యాన విధానములను తెలుపుచున్నవి.

నవీనకాలమున అన్నిమతములలోను, ఉపాసన యనగా, భగవంతుని ఒక ప్రతీకమునందున్నాడని నమ్ముటగా యున్నది. ప్రత్యేక దేవతలకు ప్రత్యేక ప్రతీకమును ఎన్నుకొనబడుచున్నది. శివలింగమున మహేశ్వరుని, సాలిగ్రామమునందు శ్రీమన్నారాయణుని, క్రాసునందు క్రైస్తును, బోధిసత్వమున బుద్ధభగవానుని, అగ్నియందు జోరాష్ట్రిపురుషుని కనుగొనుచున్నాము. శివభక్తుని దృష్టికి శిల కనుపడుట లేదు. లింగదర్శనమున మహేశ్వరునే చూచుచున్నాడు. అటులనే ఇతర భక్తులు ఇతర దేవతలను దర్శించుచున్నారు.

ఈ భావము సంశయాత్ములగు నవయువకులకు అసత్యమని తోచగలదు. ఉదాహరణములతో ఈ భావమును సవరించ ఈ సాధువు ప్రయత్నించుచున్నాడు. ఒక స్త్రీయందు పసిబిడ్డ తల్లిని చూచుచున్నది. ఆమెయందు బాలుని తండ్రికి, భార్య కనబడుచున్నది. మరొకనికి సోదరి కనబడుచున్నది. ఇంకొకతెకు పుత్రిక కనబడుచున్నది.

పసిబిడ్డ ప్రేమమర్యాదలతో తల్లిని చూచుచున్నది. భర్త మోహావేశములతో చూచుచున్నాడు. సోదరుడు భ్రాతృవాత్సల్యముతో చూచుచున్నాడు. ఆమె తల్లిప్రేమతో తనకుమార్తెను చూచుచున్నది. ఆ యువతి ఒకతే అయియుండినను, నలుగురు నాలుగు రకపు వ్యక్తులను ఆమెయందు గమనించుచున్నారు. తల్లి, భార్య, సోదరి, కుమార్తె, సామాన్య జీవితమున ఇట్టి వ్యవహారము సాధ్యముగా నుండునపుడు భక్తుడు తన ఇష్టదైవమును విగ్రహమున చూచుటమాత్రము వింతయగునా? సంశయాత్మునికి అది కేవల శిలగా నుండవచ్చును - భగవంతుడుకాదు. కాని భక్తుని భావము ఉన్మాద చేష్టయని తలచినచో ప్రపంచమున సర్వజనులు ఉన్మాదులని చెప్పవలసి యుండును.

కాని విగ్రహద్వేషులకుకూడ ఈ భావము నచ్చదని తెలియుచున్నది.

ఇట్లు భక్తుడు సర్వపరిపూర్ణ సర్వవ్యాపిక భగవదంశమును విగ్రహమునందు కనుగొనుచున్నాడు. విగ్రహదర్శనము కలుగగనే, అతని అహంకార భావములు అణగిపోయి ప్రేమభావమున దివ్య అనుభవము కలుగుచున్నది. అతడు అంతరంగమున అభివృద్ధి చెందుచున్నాడు. ఉప్పొంగుచున్నాడు.

భక్తి వేదకాలమునకు తరవాతకాలపు వికాసముగానున్నది. పురాణముల సంపద వేదకాలమున జనులు ప్రశాంత, గంభీర, నిర్మల ధ్యానపరులుగా నుండిరి. వారికి ఉపాసన నియమింపబడియుండెను. భక్తి, ఉపాసనలు, పారిభాషిక ప్రయోగమున ఏకరీతిగనున్నవి. ఉపాసనవల్లకూడ ఉపాసకుడు తన పరిచ్ఛిన్న రంగమునుండి తాత్కాలికముగ విడుదల పొందుచున్నాడు. సమష్టితో లయమగుచున్నాడు. ప్రాణోపాసన యొకటికలదు. ఉపాసకుడు తనయందలి ప్రాణమే సమష్టి ప్రాణమని తీవ్రధ్యానము చేయుటవల్ల తన వ్యక్తిత్వమునువదలి సమష్టియందు ఏకముకాగలుగుచున్నాడు.

కర్మకాండమందలి పూజాక్రమములన్నియు సాధకునికి క్రమశిక్షణయొసగు విధానములుగా నున్నవి. మానవుడు భ్రమలోలుడై యుండునంతకాలము కోరికల బురుదగుంటనుండి బైయల్పడుటలేదు. అట్టి మానవుని కోరికలను చక్కని మార్గములయందు ప్రవహించునట్లు చేయుటకు వేదపురుషులు యజ్ఞయాగముల నియమించిరి. కర్మలు సకామముతో చేయుటవల్ల పితృలోకము పొందనగును, కర్మలు ఉపాసనలతోకూడ చేయుటవల్ల స్వర్గమున దివ్యానందములు కలుగునని వేదములు తెలుపుచున్నవి.

పితృలోక, దేవలోక ప్రాప్తికొరకే కర్మకాండము నియమింపబడినదని తలచరాదు. ఏలన, ఫలభోగము పూర్తికాగా, మరల ఈ మర్త్యలోకమునకుదిగి రావలెనని శాస్త్రములు తెలుపుచున్నవి.

భూలోకమునకు ఇతర లోకములకు లెక్కింపజాలని పర్యాయములు త్రిప్పబడిన జీవుడు కొంత విరాగము పొందుచున్నాడు. అట్టివారు కర్మ, ఉపాసనలు, భగవత్ప్రీత్యర్థము సేవించవలెనని తెలియుచున్నది. అందువల్ల మనోబుద్ధులు నిర్మలతపొందగ వారు శాశ్వతానంద జ్ఞానశక్తి - పరిపూర్ణపదవిని తెలుసుకొని అనుభవింప ఆశింపగలరు.

ఇట్టి అంతర్ముఖనైర్మల్యము పొందుకొలది వారికి ఇంద్రియభ్రమణ సాధనమగు బాహ్యప్రపంచము నిస్సారయను నమ్మకము వృద్ధిచెందుచుండును. స్వర్గసుఖము కూడ అశాశ్వతమని తెలియును. పరిమితికిగల గుణము అపరిపూర్ణము. ప్రతిసుఖము, ప్రతి ఆనందమునకు ఎల్లకూడి యున్నది. కస్తూరిమృగము కస్తూరియందలి సువాసన ఎచ్చటనుండి వచ్చుచున్నదా యని అడవియంతయు వెదకి వెదకి అలసి మరణించుచున్నదో, అదేరీతి శాశ్వతానందమునకై మనము నిలుకడలేని పరిశ్రమచేసి అలసిపోయి, ఆత్మహత్య చేసుకొనుచున్నాము.

అవివేక కస్తూరి మృగమువలెనే, మానవుడు ఇంద్రియ విషయములను చూచి, చూచి, సంపాదించి, వ్యయముచేసి, కూడబెట్టి, రాసిపోసి, ధ్వంసముచేసి, మరి శ్రమపడి అల్లాడిపోవుచున్నాడు. తాను కోరిన సుఖము, సంతోషము పొందలేక తుదకు మరణించుచున్నాడు.

బాలుడు తన నీడయొక్క తలను పట్టుకొనగోరి, ముందుకుపోయి, పోయి, నీడ ఇంకను ముందుకుసాగి పోవుచుండగా, అరుగుమీద కాలుజారి క్రిందపడుచున్నాడు. అదేరీతి, మానవుడు, అశాశ్వత వస్తువులందు శాశ్వత సుఖముకోరి, తన గుంతలో పడుచున్నాడు - !! పాపము !

కస్తూరివాసన తనలోనుండి బయలుదేరుచున్నదని తెలిసిన మృగము, మరల పరుగెత్తదు. అనవసర అలసట, మరణము పాలుకాదు. సర్వానందములకు మూలాధారము తనలో యున్నదను సత్యము కనుగొనిన మానవుడు, వృథాప్రయాసలు, అలసటలు,

పోరాటములు, బజారు ఉపద్రవములు పొందడు. అతనికి జీవితమంతయు ఉల్లాసరంగముగా, విశిష్టనాటకముగా నుండును.

ఒక సాధకుడు కొన్ని సంవత్సరములు, నిష్కామ భావముతో కర్మ, ఉపాసనచేయగలిగి, మనోబుద్ధుల నిర్మలత, సూక్ష్మశక్తి పొందగలిగినచో, తన కోరికల, ఆశలను గమనించి తానే చిన్నబోవును. అతడు అవివేక, మృగమువలె, పసిబాలునివలె వ్యవహరించుటను తిరస్కరించుచున్నాడు. తాను కోరునది తనలోనే యున్నది. విషయములయందు లేదని తెలుసుకొనుచున్నాడు.

ఆనందమూలము తనలోనే యున్నదని తెలిసిన వెనుక, సాధకుడు, వేదాంత శ్రవణమున కర్హుడగుచున్నాడు. కర్మ, ఉపాసనల ఉన్నతోద్దేశమును వెదుక నారంభించుచున్నాడు. వీటిని శుద్ధ అంకిత భావముతో అనుసరించును. అందుకు ఫలముగ, విరాగము, వివేకము తీవ్రమోక్షేచ్ఛ సంపాదించుకొనును.

కనుక, ఈ నవమోధ్యాయముగు కేనోపనిషత్తు, పూర్వాంశములగు ఎనిమిది అధ్యాయముల ఫలస్వరూపమని యెంచవలసియున్నది.

ఈ ఉపనిషత్తుయొక్క ప్రారంభముననే రెండు ముఖ్యశాంతి పాఠములు కనబడుచున్నవి. అవి అర్థగర్భములై యున్నవి. వాటి విశేషములను మనము సూక్ష్మముగ గమనించెదముగాక.

## ప్రథమశాంతి మంత్రము

ఓమ్. సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం
కరవావహై,
తేజస్వినావ ధీతమస్తు మా విద్విషావహై.
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

ఓం. భగవంతుడు (గురువును, శిష్యుని) ఇరువురుని రక్షించునుగాక. భగవంతుడు మమ్మిరువురిని (పరమ) సుఖము ననుభవింపజేయునుగాక. మేమిరువురము సహకరపరిశ్రమ (చే, శ్రుతుల గూఢసత్యమును కనుకొందుముగాక). మా విచారము పరిపూర్ణముగను, ఫలవంతముగను యుండునుగాక. మేమిరువురము కలహించకుందుముగాక.

## ద్వితీయశాంతి మంత్రము

ఓమ్. ఆప్యాయన్తు మమాఙ్గాని, వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్ర మథోబల మింద్రియాణిచ సర్వాణి, సర్వం బ్రహ్మౌపనిషదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరో దనిరాకరణమ స్త్వనిరాకరణం మేఽస్తు తదాత్మనిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయిసన్తుతే మయిసన్తు.

ఓమ్. శాంతిః శాంతిః శాంతిః

ఓం. నా అవయవములు, వాక్కు, ప్రాణము, కండ్లు, చెవులు, ఇంద్రియ శక్తులు మిక్కిలి వృద్ధి పొందునుగాక. సర్వము ఉపనిషత్తు బ్రహ్మమే. బ్రహ్మ నన్ను తిరస్కరించకుండునుగాక. బ్రహ్మ లేదను శబ్దము కలుగకుండునుగాక. బ్రహ్మము తిరస్కరింపబడకుండునుగాక. ఉపనిషత్తులందు పేర్కొనబడిన సుగుణములన్నియు నాయందు వెలసి ఆత్మరతి కలుగునుగాక. అవి నాయందు వెలసియుండునుగాక.

ఓం శాంతి. శాంతి. శాంతి.

ప్రథమ శాంతి మంత్రమున, గురుశిష్యులు, విద్యాప్రదాన, స్వీకార వ్యవహారములందు ఎంతటి అన్యోన్య సహకార భావముతో మెలగుచుండిరో తెలియుచున్నది. నవీన విద్యాభ్యాసంగమున ఇట్టి సహకార భావము ఎంతదూరమయియున్నదో తెలియుచున్నది. ఉన్నత తరగతులయందు గురువులకు అల్లకల్లోలముతో, కాగితపు, పుండ్రాళ్లతో, బల్లలు పగులునట్లు తట్టుటతో, తరగతియందు ఆహ్వానమివ్వబడుచున్నది.

ఉపాధ్యాయులు, తన యుద్యోగ నిమిత్తము కుర్చీయందు ఆహ్వానించుచున్నాడు. విద్యార్థులు, తమ నిర్బంధ హాజరు దినములు గడుపుటకు తరగతికి

వెళ్ళుచున్నారు. ఉపాధ్యాయునికి, విద్యార్థులు అని వార్య సంఘటనముగా నున్నది. విద్యార్థులకు తమ ఉల్లాస కళాశాల దినముల పుష్పరాశియందు, ఉపాధ్యాయు లోకకంటకముగా అగుపడుచున్నాడు.

బ్రహ్మవిద్యయందు గురుశిష్యుల సహకార శ్రద్ధా పూరిత పరిశ్రమ లేనిది అభివృద్ధి సాధ్యము లేదు. అందు కొరకే, "మేమిరువురము కలహింపకుండుము గాక" అను ప్రత్యేక ప్రార్థన ఏర్పడినది. శ్రుతివిచారము నందు అనవసర వివాదములు కలుగుటవల్ల, ప్రమాద కర వ్యత్యాసభావములు కలిగి, శ్రుతిభావములనే విపరీతముగ తెలుసుకొను పరిస్థితి ఏర్పడగలదు. కనుక ఇట్టి ప్రార్థన ముఖ్యముగ మనకొరకై విధింప బడియున్నది.

రెండవ శాంతి మంత్రమున, సాధకుడు తన శారీరక, మానసిక, పారమార్థిక వ్యక్తిభావములకు పరస్పర స్నేహ సంబంధము కుదుర్చుట అత్యవసరమని తెలియుచున్నది. పారమార్థిక మార్గము, కుంటి, కురూపి, కుచ్ఛితులకు, మందబుద్ధులకు పొసగదు. మనము సన్మార్గమవలంభించుటేగాక, భగవంతుని యొక్క కటాక్షమును సదాకోరుచుండవలెను. "భగవంతుడు నన్ను తిరస్కరించకుండునుగాక !"

ప్రతి దినమును, గురుశిష్యులు ఈ రెండు శాంతి మంత్రముల పాడిన వెనుక వారి పాఠములను ప్రారంభించుచుండిరి. మనముకూడకలసి ఈ మంత్రములను పాడుదునుగాక !

## ప్రథమ ఖండము

ఓమ్. కేనేషితం పతతి ప్రేషితం మనః కేన
ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః
శ్రోత్రం క ఉ దేవో యునక్తి.

**శిష్యుడు:**—ఎవరి సంకల్పమువల్ల, ఆజ్ఞవల్ల మనసు తన విషయములపై ప్రవహించుచున్నది ? ఎవరి అధికారమువల్ల ప్రాణవాయువు వ్యవహరించుచున్నది ? ఎవరి సంకల్పమువల్ల మానవులు మాట్లాడుచున్నారు. కండ్లను చెవులను (వాటి విషయములపై పు) ఆజ్ఞాపించువారెవరు ?

ఈ ఉపనిషత్తు పూర్తిగ సంభాషణా విధానమున యున్నది. జీవిత వైభవము ననుభవించగలిగిన శిష్యుడు, ఇంద్రియ విషయానుభవముల ఫలితముగ, ఈ పరిమితిగల సుఖములనుచూచి విసుగుచెందుచున్నాడు. ప్రపంచమంతయు నిరర్థక పరిశ్రమ, విషయపూరిత నిత్యజీవనము, కేవలము తన నీడను పట్టుకొనదలచిన పరుగుగాయున్నది. బాహ్యమునగల ఇంద్రియ విషయములయందతనికి నమ్మకము వదలిపోయినది. వీటి సందులయందు, అగోచరమగు, అగమ్యమగు ఆనందప్రకాశమును అతడు కనుగొనుచున్నాడు.

ఇట్లు అసత్యమును త్యజించి, విచారము తనయందే మొదలిడుచున్నాడు. అచ్చట, తన్ను ఇంతకాలము బాహ్యపరిస్థితులయందు, వ్యవహారములయందు, కాలదేశముల కనుగుణముగ నాట్యమాడించుచుండిన ఇంద్రియములు తనకు కనబడుచున్నవి.

ఇట్లు విచారించుటలో అతనికి, బాహ్యవిషయరాసులను ఇంద్రియములు స్పర్శించుటకు, ఇంద్రియ స్పర్శవలన అనుభవములు కలుగుటకు ఆధారశక్తియగు మనసును అతడు కనుగొనుచున్నాడు.

మఱి, అంగముల, ఇంద్రియములతో కూడిన దేహము, ఈ మనసు, ఈ బుద్ధి, ఇవి యేవియు స్వశక్తిచేత వ్యవహరించలేకున్నవి. వీటికి శక్తినొసగు తేజో అంశమొకటి వీటికి సహాయముగ నున్నదని కనుగొనుచున్నాడు. ఇట్లుండుట తనయందు కనుగొనుచున్నాడు. తన సహచరులయందు, మానవరాశియందు కనుగొనుచున్నాడు. కాని, ఇతరుల కిట్టి సంశయము కలుగుటలేదు, కనుక తన భ్రమ యధికమగుచున్నది.

స్వభావ సిద్ధముగ అతనికి మతి నిలుకడ పొందుట లేదు. భ్రమ ఏర్పడుచున్నది. ఇట్టి గొప్ప జీవిత

సమస్యను తొలగించుకొనుటకు తన గురువును సమీపించుచున్నాడు. తన సంకల్పమువల్ల, మనసు విషయములపైపు పరుగిడునట్లుచేయగల శాశ్వత స్వతంత్ర శక్తియొకటి యున్నదా? అతడెవరు? అతడెట్టివాడు? నా అంతరమున సూక్ష్మముగ, అచలజ్ఞాన ప్రకాశ ఎఱుకతో నివసించు పరమశక్తికిని, నాకును గల సంబంధమేమి?

ఇట్టి గొప్ప సంశయమును నివారణచేయుట ఉపనిషత్తుయొక్క ధర్మముగ నున్నది. మనలో ఆత్మయనబడు శాశ్వతజ్ఞాన జ్యోతి యున్నదని స్థిరపరచుట అవసరమేర్పడుచున్నది. మన అహంకార వ్యవహారముల మరుగువల్ల ఆ దివ్యశక్తిని మనము తెలుసుకొనలేకున్నాము. అట్టి అహంకారమునుశరణాగత భావముతో ఈశ్వరార్పణముచేయవలెను. నిరంతర ఈశ్వర స్మరణ, జపము, కీర్తన, శ్రవణము, మననము, ధ్యానము. ఇందుకు సాధనములు - శ్రుతివాక్యములు ఆధారము. వాటి భావములను విమర్శించుచుండవలెను.

మన మెల్లరము ఈ చిన్న "నేను" అనబడు అహంకారమును తొలగించుకొని, గొప్ప "నేను"ను తెలుసుకొని, "శివోహం" అగుదుముగాక. ఎందరో మహనీయులట్లు చేయగలిగిరి. నీవుకూడ అట్లు చేయగలవు, అనుటయే వేదాంత సందేశము.

ఓం తత్సత్

(సశేషము)

# అక్కయ్య జీవితం

శ్రీ వేదుల రామమూర్తి

దీపావళి పండగ సమీపించింది. మా అన్నయ్య వదిననుకూడా తీసుకువచ్చాడు. మా గృహము పచ్చతోరణములతో కలకలలాడుతున్నది. కాని మా అక్కయ్య ముఖవర్చస్సు బాగాలేదు. ఆమె ముఖమున విషాద చిహ్నములు కనబడుతున్నాయి. దీపావళిరోజున మా అన్నయ్య స్నేహితులువచ్చారు. వరండాలో ఆడుచున్న మా అక్కయ్య కూతురు లీల వచ్చీరాని మాటలతో ''అమ్మనాన్న'' అని ఆయన దగ్గరకు చేరింది. మాలీలకు యిది పరిపాటి. ఎవరిని చూచినను యిలాగే అంటుంది. లోపలనుండి వచ్చిన అక్కయ్య కంట తడిపెట్టుకుని '''నాన్న కాదమ్మా''అని లోపలకు తీసుకుపోయింది. అక్కడే ఉన్న నేను అక్కయ్య మనోవేదన గ్రహించాను. పైన తల్లిదండ్రులుండగా గ్రహించి ఏమిచేయగలను? నేటి వివాహములు పుట్టింటివారికి అత్తింటివారికి మధ్య నలిగి నచ్చుటకేగాని సంసారసుఖమునకు కాదని తెలుసుకొన్నాను. అక్కయ్య జానకి పెండ్లి నాకు చాలా బాగా జ్ఞాపకముంది. నాన్నగారు చాల సంబంధములు వెదకించారు. వరుడునచ్చినను కట్నము భరింపలేమని భయపడి కొంతకాలము మౌనము వహించారు. అమ్మపోరువల్ల తిరిగి తిరిగి సంబంధమును ఖాయముచేసుకొని వచ్చారు. ఆసంబంధము అమ్మకు యిష్టంలేదు. అప్పటిలో మా జానకికి కూడా యిష్టములేకపోయినను నాన్నగారి ముఖము చూచి కాదనలేకపోయింది. మొత్తముమీద పెండ్లి నిశ్చయమైనది. మా ఆనందమునకు అంతులేదు. పెండ్లి సలక్షణముగానే జరిగింది. మా జానకి మాయింటివద్దనే ఆనందముగా కొంతకాలము కాపురముచేసింది. మా లీల ఆమెకుమూర్తియే. వివాహసమయములో కట్నముగా యివ్వవలసినపైకము యిప్పటివరకు నాన్నగారు చెల్లింపలేకపోయారు. మా జానకి ఏ ముఖముపెట్టుకొని అత్తింటికి పోతుంది చెప్పండి? పోనీ సాహసించి వెడుతుంది. భర్త ఊరుకుంటాడా? భర్త మంచివాడనుకుందాం. మా అమ్మకు ఆమెను పంపుటకిష్టములేదు. మా నాన్న మాఅమ్మచేతులలో కీలుబొమ్మ. ఇటువంటి విషమపరిస్థితులలో మాజానకి సంసారము చిగుర్చునా అని మధ్య మధ్య బాధపడుతూంటాను. మా బావ వచ్చి మాజానకిని పంపమన్నాడు. పెండ్లికిముందు బావనుగురించి మానాన్న అమ్మవద్దకోసినకోతలు బావలో కనపడకపోవుటచే బావముందు అనరాని మాటలని యిల్లరికం రమ్మన్నది. అప్పటినుంచి మా బావ మాజానకి ముఖం చూడటం మానుకున్నాడు. రానురాను మాలీలపెద్దది కూడా అగుచున్నది. ఏమిచేయను - దాని

కర్మం అలా ఉందని మా జానకి తరచు బాధపడతూంటుంది. నలుబది సంవత్సరములు దాటిన మా అమ్మకు యిప్పటికీ సంతానవాంఛ పోలేదు. కాని యిరువది సంవత్సరములు దాటని జానకిని బ్రహ్మచర్యము అవలంబించమని ఆమె కోరిక కాబోలు. అత్తింటికి పంపుటకు వప్పుకోదు. యింతకాలం మా బావ జానకితో పాటు బ్రహ్మచర్య దీక్ష సాగించాడంటే చాలా మంచి వాడనే వప్పుకోక తప్పదు. మొన్నటివరకు మా జానకిని పంపమని రాయబారములు సాగాయి. ఎన్ని జరిగినను మా అమ్మ పట్టుదలవదలలేదు. బావ రాసిన వుత్తరము యీ రోజున నే చేరింది.

గుంటూరు
5-9-56

ప్రియమైనజానకికి కృష్ణ వ్రాయునది,

ఇంతకాలం నీ క్షేమం కోరియున్నాను. కాని అట్లు ముందు ఉండనవసరము లేదు. నీ భావి జీవితము నీ మీదనే ఆధారపడి ఉంది. పాపజీవితము కూడ బాగా ఆలోచించు. నీ వద్దనుంచి ఏ సమాధానము రానిచో త్వరలో నీవు మరియొక పెండ్లి శుభలేఖ అందుకొనవచ్చును.

కృష్ణ

బావరాసిన ఉత్తరం అక్కయ్య హృదయ పద్మమును అగ్నిపర్వతమువలె పగిల్చింది. ఏమిచేయగలదు? ఎవరితో చెప్పుకోగలదు? కంటికి ఏకధారగా రాత్రింబవళ్లు ఏడ్చుచుండేది. బావఉత్తరము అమ్మకు నాన్నకు చూపించాను. నాన్న మౌనము వహించారు. మా అమ్మ యిదంతా నాటకమని పెదిమెలు విరిచింది. అంతేకాదు నా అనంతరంవరకు దానికి లోటులేదండి. తన అనంతరం దానిజీవితం అమ్మచూడదుగనుక.

నేటి నవీన ఆర్థికపరిస్థితులలో కుమార్తెల సంసార వినాశనమునకు దుష్టశక్తులు కల్పించువారు తల్లిదండ్రులేయని గ్రహింపగల్గుచున్నాము.

# వరకట్న నిషేధ శాసనము: ఒక పరిశీలన

కె. వి. యస్. సూర్యనారాయణరాజు



(గత సంచిక తరువాయి)

"ఇస్తాంటే పుచ్చుకోవడము తప్పా? ఆస్తి వుంటేనేకదా ఇచ్చేది-లేనిది ఎక్కడ తెచ్చిస్తారు?" అని కొందరు ప్రశ్నిస్తున్నారు. గుండెమీద బరువులా వున్న కన్నెచెరను వదిలించుకోవడము గురించి కట్నము యిస్తాననడం వాళ్ళ ఆస్తిపరత్వాన్ని నిర్ణయిస్తుందా? ఎక్కణ్ణుంచో అప్పుతెచ్చి, వివాహ మంటపములో వరుడిచేతిలో గ్రుమ్మరించి తత్కాలానికి సంబరపడి, తరువాత అప్పుతీర్చలేక కుమిలిపోయి బజారు బ్రతుకు నీడుస్తున్నప్పుడు ఎట్లా వుంటుంది? ఈ విషయము ఆలోచించ నవసరములేదా! వాళ్ళు వియ్యంకుల వారివద్ద కొనేది బాంధవ్యమా? లేక మరణమా? సరే! పోనీ వాళ్ళకు ఆస్తి వుంటుంది. అంతమాత్రమున వాళ్ళధనము మనకు రావాలని ఎక్కడుంది? ఆత్మాభిమానము కలవాళ్ళెవరూ ఇతరుల ఆస్తిని అన్యాయముగా తమకు సక్రమించాలని అనుకోరు. పెళ్ళిచేసుకొని, కన్యాదానముచేసిన వాళ్ళమీద పరాన్నజీవి (Parasite)గా బ్రతికేవాడికంటె నీచుడు-హీనుడు మరొకడుంటాడా? మన దగ్గర బాంధవ్యము కుదుర్చుకోవడానికి వచ్చిన మనిషి ధనము సంపాదించినది మనఇంట్లో గుప్పడానికేనా? ఏమైనా మనము పరుల ఆస్థిని ఏసమయములోనైనా ఆశించుట తప్పుకాదనేదెవరు?

మనలకుకూడ యెక్కువ ఆడపిల్లలు వుంటె ఏం జేస్తాం? వాళ్ళకుకూడ కట్నాలిచ్చి వివాహాలు చెయ్యాలికదా. అయితే ఆ కట్నాలు కుమారుడుకు పుచ్చుకున్నంత ఇవ్వనక్కర్లేదు! కుమారుడు వివాహానికి అవతలివారివద్ద కసాయి వ్యాపారిలా పనూలు చేశాం. అదీ విషయములో గుర్తించక అయినవాడికో కానివాడికో మన కుమార్తెనిచ్చి వివాహము అయిందనిపిస్తున్నాం. అంతవరకు సమాన ప్రేమాపేరాభిమానములతో పెంచి పెద్దజేసిన కొడుకు కుమార్తెల యందు మన మీనాడు చూపే ధర్మం ఇదేనా? మనము కుమారునకు వివాహము చేస్తున్నామంటే ఘనమైన కట్నము సంపాదిస్తున్నా మన్నమాట. అయితే వారు మనతో వియ్యము పొందుతున్నారంటే మనకంటె వారు ఐశ్వర్యములో అధికులై వుండాలి. లేదా యీవదాస్థిని మాటగట్టి కన్నీటితో మనకొప్పగించి వుండాలి. ఇటు కుమార్తెకు వివాహము చేస్తున్నామంటే తక్కువకట్నమిచ్చి అయిందనిపిస్తున్నాము గనుక మనకంటె వారు ఐశ్వర్యములో తక్కువై వుండాలి. ఈ స్థితిలో అటు కుమారుడితరపు వియ్యము వారికిని-ఇటు కుమార్తెతరపు వియ్యము వారికిని ఎంత తారతమ్యముందో ఆలోచించండి. ఈ మాదిరి నిత్యమూ కళ్ళకుకట్టే అన్యాయములు అధర్మముగా మనమెన్నో చేస్తున్నాం. మరయితే దేనికి భగవంతుణ్ణి పూజించడం-తోటిమానవుణ్ణి అష్టకష్టాలు పాల్చేసి "మానవసేవే - మాధవసేవ" - యని గుర్తించలేమా మనం? మనం మానవులము. దయా, జాలీ, అనుతాపం లాంటివి. మానవునిలో వుండవలసిన ముఖ్య గుణాలు. ఇవే లేనినాడు మనలో మానవత్వము నశించిందని చెప్పవచ్చునుగదా!

వరకట్న నిషేధావశ్యకతను గుర్తింపబడి రెండున్నర సంవత్సరముల క్రితము విజయవాడలో "స్నేహలతా వరకట్న నిషేధ సంఘము" ప్రారంభమయి

నది. అనేకమంది యువకులు ధర్మోత్సాహముతో ముందునకువచ్చి వేలకువేలు వచ్చేకట్నాలను తిరస్కరించి వివాహములు చేసుకొని యువకలోకమునకు ఆదర్శప్రాయులైనారు. మఱియు అనేకమంది యువకులు తమ వివాహములకు వరకట్నాలు అంగీకరించబోమని ప్రతిజ్ఞలుచేసి పలుతావులందు వరకట్న నిషేధ సంఘములు ఏర్పరచి అవిరళకృషి చేయుచున్నారు. యువతీ యువక బృందమును సంఘటితపరచి సాంఘిక దురాచార నిర్మూలనముకై నిర్విరామముగా కృషిచేయుచున్న "స్నేహలతా వరకట్న నిషేధసంఘము"లకు ప్రభుత్వము ప్రచారనిమిత్తము ధనసహాయముచేయుట అన్నివిధాల సమంజసము. ఈ మాదిరి కృషిసల్పుచున్న సంఘములకు చేయూతనీయడము మనవిధి. ధర్మముకూడాను.

ఈ రీతిగా ప్రజలలో ప్రచారము సాగుచున్నప్పుడు ప్రజా వుద్యమమునకు తోడుగా ప్రభుత్వ శాసన మెంతైనా అవసరము. ఇందుగురించి "స్నేహలతా వరకట్ననిషేధ సంఘము" వారి తీవ్రమైన ఆందోళన రాజధానీ నగరములో యెక్కువైనది. సంఘ కార్యనిర్వాహకవర్గము శాసనసభ్యులను, మంత్రివర్యులను దర్శించి తప్పక బిల్లును ఆమోదించవలసినదిగా విజ్ఞప్తిచేయగా, అన్నిపక్షములవారునూ బిల్లును తప్పక ఆమోదించెదమని హామీనిచ్చారు. ఎట్టకేలకు కలకాలమునుంచి ఆశిస్తున్న కల ఫలించినది. మహనీయుల మహదాశయము మూర్తివంతమైనది. వరకట్న దురాచార పీడిత ప్రజానీకమునకు 57 డిశంబరు 20-వ తేదీ హర్షానికి పర్యాయ పదము. దురాచారమునకు బలియవుతున్న కుటుంబములన్నీ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగార్కి అభినందన లర్పించవలసియున్నది.

## బిల్లులోని నిబంధనలు

ఈ చట్టము యావత్తు రాష్ట్రము (ఆంధ్రప్రదేశ్) నందు వ్యాప్తియందుండును. (శెక్షను 1.)

వివాహము రాష్ట్రములో ఎచ్చట జరిగిననూ లేక బయట జరిగిననూ రాష్ట్రములోని ప్రజలందరకునూ యీ చట్టము వర్తించును. (అంటే యీ రాష్ట్రము వారు మరోస్థలమునకు వెళ్ళి కట్నాలు పుచ్చుకొని వివాహము చేసుకొని వచ్చుటకు అవకాశములేదు.) (శె. 2. ఎ.)

లోగడ శారదాచట్టములో యిట్టి నిబంధన లేనందువలన చాలమంది శాసనోల్లంఘనచేయుట జరిగినది.

వివాహముయొక్క ఏఒక్క పక్షమువారు రాష్ట్రములో నివసించు వారైననూ వివాహపు యిరుపక్షములవారికి ఈ చట్టము వర్తించును. (శె. 2. బి.)

మఱియు వివాహముయొక్క యిరుపక్షములవారు యీ రాష్ట్రములు కాకపోయిననూ (యీ రాష్ట్రములో నివసించువారు కాకపోయిననూ) యీ రాష్ట్రములో జరుగు వివాహములన్నింటికీ యీ చట్టము వర్తించును. (శె. 2. సి.)

ఈ చట్టమునకు సంబంధించినంతవరకు ఒకవ్యక్తియొక్క నివాసము 1925 సం॥ ము హిందూ వారసత్వ చట్టము (Central act XXXIX of 1925) లోని 6-వ శెక్షను మొదలు 18-వ శెక్షనువరకు (రెండూ కలుపుకొని) గల శెక్షనులలోని నిబంధనల ననుసరించి నిర్ణయింపబడును.

కట్నము (Dowry) అను పదమునకు యీ చట్టములో ఈయబడిన నిర్వచనము (సందర్భము వేరుకాని యెడల ఈ నిర్వచనమే అమలులో యుండును.)

వివాహమునకు ప్రతిఫలముగా (As consideration) ఇరుపక్షముల వారిలో ఒక పక్షమువారుగాని లేక వారి తరఫువారుగాని రెండవపక్షము వారికిగాని లేక మరితరఫువారికిగాని ఇచ్చునట్టి లేక యిచ్చుటకు ఒప్పందము చేసుకొన్నట్టి ఏ విధమైన ఆస్తిగాని లేక విలువగల హామీపత్రములు (Valuable Securities) గాని "కట్నము" అర్థములోనికే చేరును. కాని ముస్లిం న్యాయశాస్త్రము వర్తించువారి విషయములో "డోవరు" లేక "మెహరు"లు మాత్రము యీ నిర్వచనములో చేరవు. (శె. 3. ఎ.)

(274 వ-పేజి చూడుడు)



# అపార్థము

శ్రీమతి దాసరి శారద



మాలతి ఆ సంవత్సరమే స్కూలు ఫైనలు పరీక్షలో కృతార్థురాలై క్రొత్తగా కళాశాలలో కాలు పెట్టినది. మాలతి చిన్నతనమునుండి ఆడపిల్లల బడిలోనే చదివింది. మంచి తెలివికలది. ఎప్పుడు పరీక్షలు జరిగినా మాలతిదే ఫస్టుమార్కు. కాని యిప్పుడు కళాశాల వాతావరణం ఆమెకు చాల క్రొత్తగా నున్నది. అసలే బస్తీ. అందులోనూ మహిళా కళాశాలకూడ కాదు. చిన్నతనంనుంచి ఆడపిల్లల బడిలోనే చదివిన మాలతికి మగపిల్లల కాలేజీలో చదవటము కొంచెం కష్టంగానే వున్నది. కాని ఆమె ఎలాగో నెమ్మదిగ అలవాటుచేసుకున్నది.

మాలతి సన్నగా, కొంచెము పొట్టిగా ఉంటుంది. పచ్చని శరీరచ్ఛాయ, పొడవైనజడ. చూచేవారిని యిట్టే ఆకర్షిస్తుంది.

మాలతి మొదటిసారి క్లాసులో కాలుపెట్టగానే మధుకి ఆమెపై ఏదో తెలియని అభిమానమేర్పడింది. ఆమె వినయము, నడకతీరు అతనిని ముగ్ధుణ్ణిచేశాయి. మాలతినిచూచి మధు ఏమిటో, ఎందుకో సంతోషంతో పొంగిపోయాడు. ఒక వారము రోజులు గడిచినయ్. మాలతి సామాన్యముగా ఎవరితోనూ మాట్లాడేది కాదు. ఆమె నిండుకుండ. తోటి ఆడపిల్లలతోకూడ చాల ముక్తసరిగా మాట్లాడేది. అట్లని ఆమెకు గర్వమని చెప్పకూడదు.

క్రమముగా రోజులు గడచి మాలతి కళాశాల వాతావరణాని కలవాటుపడింది. కాని ఆమె ఎప్పుడూ మగపిల్లలంటే కొంచెం భయపడ్తుండేది. ఏమయినా పొరపాటు జరిగితే మగపిల్లలు నవ్వుతారేమోనని ఆమెకు భయము. అందువలన ఆమె అతి జాగ్రత్తతో మెలగుతుండేది. పాఠాలు శ్రద్ధగావిని గంట కొట్టగానే యింటికి వెళ్ళిపోయేది.

మూడు నెలలు గడిచిపోయినయ్. పరీక్షలు జరిగిపోయినవి. సెలవు లివ్వనూ యిచ్చారు, మళ్ళీ కాలేజీ తియనూ తీశారు. మాలతి మామూలుగా తన తరగతికివెళ్ళి కూర్చున్నది. ఆ రోజు 'లాజిక్' లెక్చరర్ కామేశ్వరరావు క్లాసుకి వచ్చాడు పేపర్ల కట్టతో. పిల్లలందరి దృష్టి పేపర్లమీదే వున్నది. ఇంతలో ఒక పిల్లవాడులేచి "ఫస్టుమార్కు ఎవరిదండీ?" అని అడిగాడు.

కామేశ్వరరావు ఒకసారి మార్కుల జాబితాను జాగ్రత్తగా పరిశీలించి "ఫస్టుమార్కు 65, మాలతి. నెం॥ 30" అని చెప్పాడు.

"ఆడపిల్ల కదటోయ్. ఫస్టుమార్కురాక ఏమిచేస్తుంది." అని ఒక కంఠము సన్నగా వినిపించింది మాలతికి.

మాలతి గతుక్కుమన్నది.

పాపము మాలతి శక్తినంతటిని ధారపోసి చదివి సంపాదించిందీ ఫస్టుమార్కుని. కాని ఊరికినే అంతమాటవినబడేటప్పటికి మాలతి హృదయము కలుక్కుమన్నది. కళ్ళల్లో నీళ్ళు గిర్రునతిరిగాయి. ఇదంతా గమనిస్తున్నమాలతి స్నేహితురాలు రమ "ఊరుకో మాలతీ! అంత చదువుతూ కూడ కొంచెముకూడ ధైర్యంలేదే? అతనికి నీ విలువ తెలియదు గనుకనే అలా అన్నాడు. అంతమాత్రనికి నీ వింతగా బాధపడాలా?" అని ఊరడించింది. మాలతి ఎలాగో స్థిమితపడింది.

ఇంటిగంట కొట్టగానే తలవంచుకొని వస్తున్న మాలతి "కంగ్రాచ్యులేషన్సు మాలతీ!" అన్న మాటలు విని వెనక్కుతిరిగి చూచింది. ఎవరో ఒక అబ్బాయి తనను వెంబడించి వస్తూ కనిపించాడు.

"ఎవరబ్బా! నాకు కంగ్రాచ్యులేషన్సు చెబుతున్నాడు?" అని ప్రశ్నార్థకంగా అతనివైపు చూచింది మాలతి.

"మీకు నేను తెలియకపోవచ్చు. నా పేరు మధు. మీ సహాధ్యాయుడిని" అన్నాడు ఆమె సందేహం తీరుస్తూ.

"ఓ! అలాగా!" అన్నది నెమ్మదిగా.

"మీకు లాజిక్‌లో ఫస్టుమార్కు వచ్చినందుకు చాల సంతోషమండీ! అందుకే అభినందనలు తెలియచేద్దామని యిలావచ్చాను." అన్నాడు మధు.

"కృతజ్ఞురాలను." అన్నది మాలతి.

అంతే ఆమె యింక ఏమీమాట్లాడలేదు. మధు వెళ్ళిపోయాడు. మాలతి మళ్ళీ నడక సాగించింది.

"మధు! ఎవరో? నేనెప్పుడూ చూడలేదే. అయినా నాకు ఎవరుతెలుసుగనుక - యీ మధు తెలియడనుకోవటానికి. అయినా అంతగా అరుచుకుంటూవచ్చి అభినందనలు చెప్పవలసిన అవసరమేమిటో?" అనుకున్నది మాలతి. ఇంతలోయింటిని సమీపించటము చేత ఆలోచనలు అక్కడితో ఆపి లోపలికి వెళ్ళింది. వంటగదిలోకి వెళ్ళగానే తల్లి కాఫీ అందించింది. కాఫీనీళ్ళు గొంతులో పోసుకొని వచ్చి కుర్చీలో చతికిలబడింది మాలతి. మళ్ళీ ఆమె మెదడులో ఆలోచనలు బయలుదేరినయ్.

ప్రొద్దున క్లాసులో ఎవరో అబ్బాయి ఏదో ఊసుపోక అన్నమాట మాలతికి ఎంతో బాధ కలిగించింది.

తరువాత మధు సంగతి గుర్తుకొచ్చింది. మధు మాత్రము తక్కువవాడయి వుంటాడా? ముందు అభినందనలూ — వెనుక అవమానాలు చేస్తుంటారు కొందరు. అలాంటివాడేమో యీ మధు. లేకపోతే ముక్కూ ముఖము తెలియని నాకు అభినందనలు చెప్పటానికి రావటమేమిటి? ఏమోనబ్బా! చాల జాగ్రత్తగా మెలగాలి. ఏదో చెప్తారే "మగవారికి దూరముగా మసువలెపుడు ... ..." అని అనుకున్నది మాలతి.

ఆ రోజు గడచిపోయింది. మళ్ళీ తెల్లవారి కళాశాలకు వెళ్ళింది. ఆ రోజు ఏమీమార్పులేదు. మామూలుగా పాఠాలువిని తిరిగివస్తున్న మాలతికి మళ్ళీ మధు ప్రత్యక్షమయినాడు. చేతిలో ఒక పుస్తకమున్నది. మాలతిని సమీపించి తన చేతిలోని పుస్తకాన్నిస్తూ "ఇదుగోనండీ. ఈ పుస్తకము చాలా బాగుంటుంది మీరుకూడా చదువుతారని తెచ్చాను" అన్నాడు. మాలతికేమిచేయటానికి తోచలేదు. వద్దంటే ఏమి తప్పో అని "థాంక్స్" అని పుస్తకాన్ని తీసుకుంది.

"దానికేముందండీ" అంటూ వెళ్ళిపోయాడు మధు.

మాలతికి తల వేడెక్కిపోయింది. 'ఈ మధు నన్ను వదలిపెట్టేట్లులేడే?' అనుకున్నది. 'ఇంతకీ యీ పుస్తకము పనికట్టుకొని పట్టుకురాకపోతే ఏమో?' అనుకున్నది మాలతి. కాని పైకి ఏమీ అనలేకపోయింది.

మాలతిలో ఏదో మార్పు వచ్చినది. ఆమె మనస్సు స్థిమితాన్ని కోల్పోయింది. ఎప్పుడూ ఏవో పిచ్చి ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. పాఠాలు చదవటములో శ్రద్ధ తగ్గిపోయింది. తప్పనిసరిగనుక కళాశాలకు వెళ్ళి తిరిగి యిల్లు చేరుతుంది. మాలతి ఆహారము విషయములో అశ్రద్ధచేయటము చేత ఆరోగ్యము దెబ్బతిన్నది. నీరసము ఎక్కువయింది. డాక్టర్లు విశ్రాంతి అవసరమని చెప్పారు. తిరిగి పదిరోజులకుగాని ఆమె బాగుపడలేదు. ఆ తరువాత మళ్ళీ కాలేజికి వెళ్ళింది - కాలేజి గేట్‌లో మధు కన్పించాడు. మాలతి చూచి చూడనట్లు లోపలకు వెళ్ళబోయింది. కాని మధు ఆమెను కలుసుకొని "ఏమండీ! ఈ మధ్య కాలేజికి రావటము మానేశారు. ఆరోగ్యము సరిగాలేదా?" అన్నాడు. మాలతి కొంచెం విసుగ్గా "ఔనండీ!" అని లోపలికి వేగముగా వెళ్ళిపోయింది.

మధు మౌనముగా ఉండిపోయాడు.

మాలతిలో మళ్ళీ ఆలోచనలు బయలుదేరినయ్. 'ఈ మధుకి నా స్వవిషయముతో పనేమిటో? ఒకసారి అభినందనలంటాడు. మరొకసారి పుస్తకముతో ప్రత్యక్షమయ్యాడు. ఇప్పుడు కనబడితే ఆరోగ్యం సంగతి అడుగుతాడు. ఈయన సంగతేమిటో అర్థము కాకుండావున్నదే? ఈ సారి తేల్చుకోవాలి.' అనుకున్నది మాలతి.

మళ్ళీ ఆరునెలల పరీక్షలు దగ్గిరికి వచ్చినయి. పిల్లలంతా బాగా చదువుతున్నారు. మాలతిగూడా శ్రద్ధగా చదువుకుంటోంది.

ఆ రోజు సాయంకాలము ఐదుగంటలవుతుంది. మాలతి యింట్లో కూర్చుని తన క్లాసు పుస్తకాన్ని చదువుకుంటున్నది. తల్లి ప్రక్కవారింటికి వెళ్ళింది. దీక్షగా చదువుకుంటున్న మాలతి ఎవరో తలుపు నెట్టినట్లుంటే వెళ్ళి తలుపుతీసింది. అంతే. ఆమె ఆశ్చర్యపోయింది. తన క్లాసుమేటు మధు! ఇక్కడికికూడా వచ్చాడు! మాలతికి ఏదో ఆలోచన తట్టింది. ఎలాగయినా మధు విషయము తేల్చుకోవాలని ఆమె ఎదురు చూస్తున్నది. ఆ అవకాశము యిప్పుడు దొరికింది. మధుకి గట్టిగా బుద్ధిచెప్పాలని నిశ్చయించుకొన్నది. ఆమె వెంటనే "లోపలికి రండి" అన్నది. మధు మెల్లగా లోపలికివచ్చాడు. కుర్చీలో కూర్చున్నాడు.

"ఏదో పనిమీద వచ్చినట్లున్నారు" అన్నది మాలతి.

"ఔనండీ! మీ 'లాజిక్' నోట్సు యిస్తారేమోనని వచ్చాను" అన్నాడు మధు.

"అదా సంగతి! లాజిక్ నోట్సుకోసము యింత దూరము రావాలటండీ! అయినా మీకు మగపిల్లలెవరూ తెలియరా? ఆడపిల్లల నోట్సుతోనే అవసరం ఏమిటి?" అని కొంచెము కఠినముగా మాట్లాడినది మాలతి.

మధు ఆశ్చర్యపోయాడు.

మాలతి మళ్ళీ ప్రారంభించింది. "చూడండీ. నేను చాలకాలమునుండి గమనిస్తున్నాను. మీరు పనికట్టుకొని నాతో చాలా సార్లు మాట్లాడారు. మొదట్లో ఏమోనని ఊరుకున్నాను. అదే పనిగా ఆడపిల్లలతో మాట్లాడటము మర్యాదలక్షణమేనా? ఆలోచించండి. మన క్లాసు పిల్లలుగూడ యీ విషయము బాగా గమనించారు. ఏమయినా నాకు మీ ప్రవర్తన నచ్చలేదు సుమండీ! ఇకనుంచయినా మీరు మార్పుచెందుతారని ఆశిస్తున్నాను." అని చిన్న ఉపన్యాసమిచ్చింది మాలతి.

మధు కండ్లలో నీళ్ళు తిరిగినయి. మాలతివైపు చూడకుండానే చెప్పటము ప్రారంభించాడు.

"క్షమించండి. మిమ్మల్ని కష్టపెట్టాను. నిజమే. నేను మిమ్మల్ని ఒకటికి రెండుసార్లు మాట్లాడించాను. దానికి కారణము లేకపోలేదు. ఇప్పుడా కారణము మీకు చెప్పక తప్పటములేదు.

ఆరు సంవత్సరాలనాటిమాట:

అప్పటికి నాకు పన్నెండేళ్ళుంటాయి. మా చెల్లెలు పార్వతికి పది సంవత్సరాలు. పార్వతి అప్పుడు రెండవఫారము చదువుతున్నది. నా పంచప్రాణాలూ పార్వతిమీదే వుండేయి. ఎందుకంటే పార్వతితప్ప యీ ప్రపంచములో 'నా' అనేవాళ్ళు నాకెవరూ లేరు. మా యిద్దరిని ఒకరికి అండగా ఒకరిని బ్రతకమని కాబోలు తల్లిదండ్రులు తమ దారిని తాము యీ ప్రపంచమునుండి శాశ్వతముగా సెలవుతీసికొని వెళ్ళిపోయారు. అప్పటినుంచి నేను పార్వతిని నా ప్రాణముకంటె ఎక్కువ ప్రేమతో చూచుకుంటూ వచ్చాను. పార్వతి శరీరచ్ఛాయ మేలిమి బంగారంలా వుండేది. పొడవైన జడ. సన్నగా, పొట్టిగా, చూడముచ్చటగా వుండేది పార్వతి. చదువులోగూడ మంచి చురుకుదనము కనబర్చేది. 'అన్నయ్యా!' అని పిలుస్తుంటే నా హృదయము ఆనందముతో పొంగిపోయేది. అంతేకాదు. పార్వతి నాతో "'పితృ

సమోజ్యోష్ణ' అంటే ఏమిటో అనుకున్నాను అన్నయ్యా! ఇప్పుడుగాని నాకు దాని భావము పూర్తిగా అర్థముకాలేదు” అంటూ ఉండేది. అంత చిన్న వయస్సులో పెద్దమాటలు మాట్లాడేది పార్వతి.

అటువంటి పార్వతి ... ... ఒక రోజు — నేను కలలోగూడ ఊహించలేదు.

“తలనొప్పిగా వుందన్నయ్యా” అన్నది పార్వతి.

నేను ఏదో సామాన్యమైన నొప్పి అనుకున్నాను. కాని ఆ నొప్పి అంతటితో ఆగలేదు. రెండవ రోజు పార్వతికి జ్వరము వచ్చింది. డాక్టరు దగ్గరకి తీసికొనివెళ్ళాను. మందు యిచ్చారు. నాలుగు రోజుల తరువాత పార్వతికి జ్వరము ఎక్కువయింది. ఐదవ రోజు జ్వరము చాల తీవ్రముగావుంది. పార్వతి కలవరించటము మొదలు పెట్టింది.

“అన్నయ్యా! అమ్మా నాన్న ఎక్కడికి వెళ్ళారో చెప్పు. ఏ మన్నయ్యా! చెప్పవా? సరేలే. నీవు చెప్పకపోతే ఏం? నేను పోలేనా?” అంటూ కలవరించింది.

నాకు ఏమీతోచలా. కాళ్లూ — చేతులూ ఆడలేదు. అంతే పార్వతి మళ్లీ పలకలేదు. పార్వతి! నా ఆశాజ్యోతి — ఆరిపోయింది. అప్పటినుండి నేను మళ్లీ మనిషిని కాలేకపోయాను. ఆమెను మరచిపోలేను.

రోజులు దొర్లిపోయాయి. రోజులేమిటి? సంవత్సరాలే గడచిపోయినవి. నేను స్కూలుఫైనలుపాసయి కళాశాలలోచేరాను. కళాశాలలో చేరిన పదిరోజులకే ఒక సంఘటన జరిగినది. దానిని గురించి మీకు చెప్పాలి.

ఆ రోజు మీరు క్రొత్తగా క్లాసులోకి వచ్చారు. మాలతీ! మిమ్మల్ని చూడగానే ఒక క్షణము నన్ను నేను మరచిపోయాను. మిమ్మల్ని చూస్తూవుంటే నాకు పార్వతి జ్ఞాపకము వచ్చింది. పార్వతి అచ్చమీలాగే వుండేది. పొట్టిగా, సన్నముగా వుండేది మాపారు. అబ్బ! ఆమెనుచూచి ఎంతకాలమయిందో గదా!

మాలతీ! మీతో మాట్లాడాలనిపించింది కారణముపైన చెప్పానుగా, పార్వతి మీలాగే వుండేదని. కాని ఎలా మాట్లాడటం? అందుచేత మాట్లాడకుండానే చూస్తూ కాలము గడిపాను. ఒక రోజు మీతో మాట్లాడే అవకాశము కలిగింది. ఆ రోజు 'లాజిక్'లో ఫస్టుమార్కు వచ్చింది మీకు. నేను అభినందించాను. తరువాతకూడ ఒకటి రెండు సార్లు మీతో మాట్లాడాను. ఎప్పుడయినా మీరు కళాశాలకు రాకపోతే నాకు ఏదో బెంగగా వుండేది. మా పార్వతి అనే దృష్టితో మిమ్మల్ని చూచాను. మీతో మాట్లాడుతుంటే మా పార్వతితో మాట్లాడుతున్నట్లనిపించేది. అందుచేతనే మీతో మాట్లాడాలని తహతహలాడాను. మాలతీ పార్వతీ ఒకరే అనుకున్నాను. పార్వతే మాలతి రూపముతో కనపడిందనుకున్నాను. అందుకే పనికట్టుకొని పలకరించాను. కాని నేనేదో దురుద్దేశముతో పలకరిస్తున్నానని మీరు భావించారు. అది నా దురదృష్టం. ఇంతకీ నీవు నన్ను అపార్థము చేసుకున్నావు మాలతీ!” అంటూ వెళ్లిపోయాడు మధు.

---

# శ్రీ రామకృష్ణ దివ్యవాణి

శ్రీమతి H కనకలక్ష్మమ్మ

సోదరీ! రమ్మా. మనము శ్రీ శారద శోభను దిలకింతము. ముజ్జగముల బొజ్జన నింపిన ముద్దరాలు. కనకంపు బొమ్మ. అమ్మలగన్నయమ్మ. రతనాలలతిక. అల్లది గో వేణువు మృదంగభింభిణీ, శంఖ ఘంటా నాద, వీణానినదములు వినవచ్చుచున్నవి. అమ్మకు అభ్యంగనోత్సవమును సలుప త్రిదేవులు వచ్చియున్నారు. రత్నసింహాసనమున నిండు పేరోలగమున కాలిపై కాలు వైచికొని జగన్నాయకి, త్రిలోకపాలకి, మెరయుచున్నది. రాణియగునామె రాజఠీవిని మరువక ఏమరుపాటులేని లోకసంరక్షకనియామకమున నుండు చందమున గంభీర, ధీర, కటాక్షవీక్షణముల సభాభవనమును నింపుచున్నది.

వేరొకవైపు, భీతహరిణేక్షణ యట్లు బులి బులి చూడ్కుల, చూచుచున్నది. తన నాథుడగు జగన్నాథునిదలంచి, స్త్రీజనోచితమగు నును సిగ్గుదొంతరలు తెరలు తెరలుగ తేలియాడ, తెలిమల్లె కుసుమంపు సొబగు సొంపును పెంపొంద, మృదుమధురప్రేమ వీచికలనామెలయూగ నాపెమానసకన్యక, నిత్యనూతన కన్యయగుటంజేసి, నిత్యకళ్యాణమును జేయించు నామె, సాత్వికముక్త స్వభావముంచూరగొన్నయామె ప్రభువై, విభువై, వింత శోభల, మధుర మంజులవాక్కులతేనియ లొలుక నాపెకనుదోయి విందొనర్ప, ముక్తామణిం జేపట్టిన, మునిమానసహారి ఆ తండెంతటిఘనుడోగదా! త్రిలోకరాణి వింత సొగసునుగన ముక్కోటి దేవతలు యుగయుగములుగ గాచియున్నారు. ఆ త్రినేత్రి, మందమందగమనమునే, వర్ణింపజాలక మహాకవులు కన్నీరు గార్చుచున్నారు.

ఆ మందయాన హంసగమనమునే ధీరుడు, ఏ ప్రతిభాశాలివచించి ప్రఖ్యాతి గాంచగలడు? కల్ల కల్ల ఆమెమందగమనమును వర్ణింపకొలది యుగములు తపసు జేసినగాని, యింకను మహాభక్తికాంతను సహాయభూతురాలినిగ జేసికొన్నగాని, యింకను జ్ఞానమను ప్రౌఢను ఆలింగనము జేసిగొన్నగాని యీ త్రిపురసుందరీ గమనమును భావించి భరియింపజాలరు. ముజ్జగముల మోహింపజేయు నామె స్మరణయే యిట్టులుండ యీ ఘనపండితులమనుకొను దుర్బలులెట్లు వర్ణింపగల్గుదురు?

అయ్యారే! ఒక్కపరి ఆ శోభనవిగ్రహమునుగాంచి మీజన్మలు సార్థకత

బొందగ నుత్తమగతులకు బొందు ఫాలేందు ముఖిని, గాంచనిమీాజన్మవృధా!

జ్యోతిర్మయినిగాంచని గాంచని మయమునుధరించిన మానవుడు, నిరుపేదగాక భాగ్యవంతుడెట్లగును?

సోదరీ! యికనీ భావోద్రేకమును ఒకప్రక్కకు తొలగద్రోసి, ఆమెనువర్ణింప శక్తి నొసంగ నొక్కపరి ప్రార్థించెదను.

మాణిక్య వీణాం ముపలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసాం
మహేంద్ర నీల ద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం మనసాస్మరామి ॥

ఆమెను వర్ణింప బూనుగొనుటతోడనే నామనంబు పరిశుద్ధమై త్రినదీ స్వరూపమును ధరించి జల, జల, పారి సముద్రమున గలసిపోయెనిక వర్ణించుట కేరున్నారిచ్చట? నేను ఖాళీనైతిని.

కానిమ్ము ప్రయత్నింతును.

అట్లు ఆ మందగమన అభ్యంగన మహోత్సవమున మువ్వురు వనితలు హారతులీయ, పాటలుపాడి, వెట్టనీళ్లు చుట్టి అగరు తైలమునంటి, ఘుమఘుమమని పరిమళములీన సున్నిపిండితో నలుగులు బెట్టిరంత. పన్నీటను జలకములాడెను. తదుపరి, ముత్యపు తేటను జలకములాడించిరి. రత్నపు వెలుగుల నొడలు నొత్తిరి. లక్ష్మిసరస్వతి, పార్వతులు, తమ మేనులుమరచి, దివ్యానందమున లీనమైనవారై ఆమెనలంకరించుటలో ఒకటిజేయబోయి వేరొకటి జేయుచుండిరి. ముక్తామణియెదుట నిలచిన మతులుబోకయుండునా? స్త్రీ పురుష, ఆబాలగోపాలము ఆమె శోభన కళ్యాణమును జూచిన మతి భ్రమించకపోదు. వివశులై నిట్టూర్పులబుచ్చుచు, పెదవులవిఱుచుచు దీనంపు చూడ్కుల జూచుచు, చిరుచెమ్మటలు గ్రమ్మ అలసిపోయినవారై తమకు తెలియకనే ఆమెను శృంగారించుచుండిరి. అచటనంతయు నిశ్శబ్దతయే. మౌనులై, స్థిరమానసులై తమను మరచినవారై, వేడ్కమీార తమ హృదయతంతువుల మీాటుచు, గీతముల నాలపించినవారై, భక్తభావకుంభము నుండినదధిని మధించినవారై, ఆమె చిరుతనోటికందించు నవనీతపు సుద్దల కంతేలేదు. జ్ఞానుల స్తోత్రపాఠములు మిన్నుముట్ట జ్ఞానసుధను నచట ప్రవహింప జేయుచుండ నమృతమూర్తులై త్రిలోక సౌందర్యోపేతులై నచటనున్న ఎల్లవారలు దేవతలకు దేవతలవలె శోభిల్లిరి.

అచట నంతయు ఏకభావమే. అచట నంతయు నద్వైతమే. ఆమె కర్త వీరు కారణులు. ఈయిరువురుకలసి, కర్త కారణత్వమును సమన్వయమొనర్చిరి. వైరాగ్య చింతామణులు మేలుమేలని కరతాళములు జేయ, ఆమెకు తీయని

క్షీరమును ద్రావించిరా మదవతులు. యింకను పునుగు, జవ్వాజి, మొదలగు ధూపముల వేసిరి. కురుల నార్చిరి. ఆ నీల వేణియందచందమును, హరి, హర, బ్రహ్మాదులే వర్ణింప జాలరన్న నిక సామాన్యుల దొక లెక్కయా? తుమ్మెద రెక్కల బోలు నల్లనిజీమూతమును నిగ, నిగ, నిగలముందు నగలేలా? చిరుసుళ్లు తిరిగిన యీ పెకురులు, జ్ఞానుల దీర్ఘపయనమును బోలియున్నవి. అనగా, ఇది కాదిది కాదని, యింకను ముందుకు పోవు ఘట్టముల వలయములబోలి వలయములున్నయవి, చిరుగాలికి నల్లలలాడ ఫాలభాగమును అపుడపుడు ముద్దిడు ఆచిరుత వెంట్రుకలు ఎంతటిపుణ్యమును జేసికొనినవో కదా! ఆఫాలమో! అయ్యారే దిగంత విశాలము. సరస్వతి కాట పట్టగు నీఫాల సౌందర్యము నికవర్ణింప పనియే లేదు. మిట్ట పల్లములుగాక, పలకవలె దివ్యకాంతుల, దివ్యభావపరంపరల నీను, ఆ ముద్దుఫాలమే యొక్కరి కుండును? ఆ ఫాలమును జూచుచుండినందు వట్రువదిరిగిన కనుబొమలు మనస్సునకు బాణములవలె దగుల్కొని, నిక వెలికిదీయుటకు చేతగాక పండితుల మనంబుల చూరగొన్న యానళినాక్షి భ్రూలతలు లతలై నల్లికనల్లి మనంబు నాకర్షించి పెనుమందారమై సహస్రార పద్మమునకు మార్గముంజూపుచున్నవి. పండితవరేణ్యుల కావట్రువదిరిగిన కనుబొమలు మరియు యింద్రధనుసునందు సప్తరంగులకన్నను మించిన చిత్కళా వర్ణములీ కనుధనుస్సునన్నవి. ఆయింద్ర ధనుస్సన్నవో బాహ్యనేత్రములకు గోచరమగు వర్ణములేగాని యీధనువునకు మానసిక నేత్రమున గోచరమగు దివ్య రత్న వైఢూర్య, నీలగోమేధిక పుష్పరాగముల సొబగునీనుచుండ ఏధనువు గొప్పదియో నూహింపుడు, మరియుసత్వవాసనల వంటి, సువాసనలీ వర్ణములకు స్వాభావికముగనున్నవి. యీ దివ్యపరిమళములు భక్తులను రాగభక్తులుగ నొనర్చుచున్నవి. దివ్యసందేశము నిచ్చుచున్నవి. జాగృతి జాగృతి యని మేలుగొలుపుచున్నవి. అజ్ఞాననిదురనుండి, లెమ్మని ఈ మన్మథ బాణములనున్న కనుబొమలు వేదఘోష జేయుచున్నవి.

ఆ వేదఘోషను ద్రోసిరాజని, నేనెటుల వానివిడచి, దగువకు, రాగలను? మరియు ఆకర్ణాంత నేత్రములెట్లు వర్ణింపగలను? పోనిమ్ము నిదియును మంచిదే. ఆ వేదోద్భూతను వర్ణింపనేనశక్యను. గాన ఆభ్రుకుటిద్వయము! పలుకు పలుకు నాలకించి, నేవర్ణనకు బూనుకొందును.

అహో! నీరజాక్షీ! యిందునిభాననా! అనంత కళ్యాణగుణాకరీ, పాపవిధ్వంసకరీ, మాననీయా! త్రివేణీసంగమదాయినీ నీల

సిరజ చకోరాక్షీ, పద్మపల్లవాధరీ, అనుపమమందారా! నిత్యముక్తి ప్రదాయినీ, నిత్యా నిత్య వివేకప్రదాయిని! మాణిక్య వీణాధరీ! ధరిత్రీ భువనమోహినీ భుక్తి ముక్తి ప్రదాయినీ జగదేకమాతా! నమస్తే! నమస్తే! నమస్తే!

అహో! నీదివ్యచక్షువు లెవ్వారలు ముఖాముఖి జూడంగలరు? తేజస్వ తేజః పుంజములగు నీ చూడ్కులు మాహృదయముల జొచ్చి, మా పాప పంకిలమును జీల్చి చెండాడి, వజ్రాయుధమువలె, పాలించుచున్నవి. మా గుండియలవియుచున్నవి. మేము తడబడుచున్నారము.

మా కరకమలములు వణకుచున్నవి. మాయధరము వణకుచున్నది. నిన్ను స్తోత్రముచేయ డగ్గుత్తికయగుచున్నది. మ్రింగుడువడుట లేదు. మా చూడ్కులు నీ తేజోమయ నేత్రముల జూడజాలక అల్లల్లాడుచున్నవి. తేరిపారి జూడ నేరకయున్నవి. మామనంబులు తపించుచున్నవి.

విశ్వ కళాచాతురీ! మిరుమిట్లుగొలుపు నీ దివ్య చూడ్కి, మాచూడ్కికవలు భరియింపనోపవు. పంకజాక్షీ! నీ హృదయము నొక్కింత మాయుము. అల్పులము, కించిజ్ఞులము.

నిను జూడ వెఱతుము. మాయందు దయంగొని నీక్రీగంటి చూడ్కు వెన్నెలల మమ్ములరించినగాని, నీయీ విశ్వరూపమును నేభరియింపజాల, భరియింపజాల. త్రిలోకపావనీ! నోరకంట శివుని ధ్యాన ముద్రల బోలియున్నవి. నీ క్రీకంటి చూపుల నొప్పును. అమ్మా! అమ్మా! కాళీ! మహాంకాళీ! దాసోహమనెడు నన్ను అనుగ్రహించి బ్రోవుమా.

చాముండీ! విశ్వకర్మను సృష్టించిన సమర్థ సీమంతినీ! పాహిమాం పాహి! అమ్మా!

నీనవరస భావరుచుల వర్ణింప నలనాదిశేషునకైనను దరముకాదనిన నిక నేనెంత నీకీకంటిసొంపు సౌరు ఎట్లున్నదనిన చిరుత బాలుడు, తన మాతృమూర్తి, ప్రేమంపు కౌగిలియందుండి, నమృతసమమగు మాతృ స్తన్యమునుగ్రోలు, ఆతని ఆనందమువలె, నిండు వెన్నెలల జలకములాడు, ఆతని రీవి ఆతనిమనంబు నిండ, తన మాతృప్రేమ పూర్ణమగు చిరుత హృదయము వికసింప చిరుచిరు నగవుల తన యమ్మనుజూచు బాలుని భంగి, నీక్రీగంటి చూపు మా హృదయముల దద్దరిల్లంజేసిన, నీ విశ్వరూపపు జూపును సమాస్వాదించినది.

జైహో! యికనీ కెంపుపెంపు పెదవుల నావర్ణింపవలె? అహో! నీనోరునుజూచిన నికమేముండము, మము నమిలి మ్రింగివేతువు. దయాశాలినీ! నీవే నీయనుంగు బిడ్డనగు నన్నొక్కపరి యెత్తి నీ ముద్దుపెదవుల ముద్దిడుగొనుము. తల్లీ! నే గోరునది సబబుకాదా? యిక నా ముద్దుతో నా వర్ణనలనుమాని, నీయందైక్యమగుదును.

---

# రథసప్తమి

'ప్రభ'

[రథసప్తమినాడు సుధ మనోరథం పూలబాటలో నడిచింది. సూర్యుని రథాన్ని ఈరోజునుండి వేగంగా నడిపిస్తాయి సూర్యుని సప్తాశ్వములూను. సూర్య ప్రీతికరమైన ఈరోజున గృహలక్ష్ములంతా సూర్యుని పూజిస్తారు. నాస్తికుడైన సూర్యంకూడా ఆరోజునుండి సూర్యప్రసాదంవల్ల భగవద్భక్తుడుగా మారిపోతాడు.]

రాధకి కడుపు చెరువైపోయింది సుధ సంగతి విన్నాక. పురుషులమీద నమిలిమింగేద్దామన్నంత కోపం వచ్చింది. పురుషులంతా ఇంతే అయితే లోకం శోకమయం అయిపోదూ! తన భర్తా అంతే. ఎప్పుడూ చిర్రూ బుర్రూ అంటూ ఉంటాడు. తను మాత్రం అతని మాటలేమీ లెక్కపెట్టుకోదు. కొండంత కోపంతో అరిచివెళ్ళినా మళ్ళా వచ్చేటప్పటికి, "ఏమండీ! భోజనానికి ఇంత ప్రొద్దుపోగొట్టుతున్నారు?" అంటూ నవ్వుతూ పలకరిస్తుంది.

చేతిలో కూరలసంచీ అందుకుని 'ఒక్కమాటు ఆ కుర్చీలో కూర్చోండి. నేను అన్నం వడ్డించి పిలుస్తాను' అని గబగబా వడ్డనజేసి సశేషం కోపాన్ని తగ్గించేస్తుంది చంద్రానికి రాధ.

ఆ శక్తి ఎందరు స్త్రీలకుంటుంది? పాపం సుధ అలాంటి నెరజాణ కాదు. సుధ ఆదర్శ మహిళా రత్నం అనవచ్చు. తన ఆదర్శాలన్నీ సక్రమంగా నెరవేర్చుకుంటుంది. సుగుణాలన్నీ ఆమెలో మూర్తీభవించాయి. నెరజాణ కాకపోయినా తెలివితక్కువది మాత్రం కాదు సుధ. ఎటుచూసినా ఆమెలో లోపం భర్తను తనవశం చేసుగోలేకపోవడం ఒక్కటే.

సుధ తెలివితక్కువదిగా చిన్నప్పటినుండి పరిగణింపబడలేదు గాని భర్త దగ్గిర మాత్రం ఏమివినియోగపడ్డంలేదు ఆమె తెలివితేటలు. ఆమెకే భర్తను మెప్పించే తెలివితేటలు ఉంటే ఆమె చేసేపని ఏదైనాసరే విఘ్నేశ్వర పూజలేని దండుగౌతుంది.

భావ గర్భితములైన ఆమె చర్యలు ఈలోకం దృష్టిలోనూ భర్త దృష్టిలోనూకూడా అవకతవకగా ఉండవచ్చు. అంత మాత్రంచేత సుధను పట్టి దద్దమ్మగా కట్టిన భర్త మాత్రం ఏమంత సరసుడు?

సుధయొక్క సున్నితమైన హృదయపుష్పం కర్కశ హస్తాల్లో నలిగిపోదగింది మాత్రం కాదు.

అలాంటి సుధ బాధలు పడుతోందంటే పూర్వ జన్మకర్మ ఉందని ఒప్పుకు తీరాలి.

## 2

చంద్రం రాగానే కాళ్ళు గడుక్కోమని నీళ్ళు ఇచ్చి కాఫీ టిఫినూ ఇచ్చి సాయంత్రం వంట అయింది గనుక తీరుబడిగా కూర్చుంది చంద్రం కూర్చున్న వాలు కుర్చీ పక్కగా రాధ.

చంద్రం ఏదో మాట్లాడుతున్నాడు రాధతో. మాట్లాడుతూ రాధ మొహం కళావిహీనంగా ఉండడం గమనించాడు. "రాధా! ఎప్పుడూ లేదు ఇవాళ నీ ముఖం వాడిపోయిందేం! నేను కోప్పడ్డానని కాదుగదా?" అన్నాడు.

"అబ్బే! మీరు కోప్పడ్డం, మీరు ప్రేమించడం నాకుమామూలే. మీ కోపం ఎంతసేపు! మీ ప్రేమ ఎంతసేపు! మెరుపుతీగలాంటిదే మీ కోపం; అదేం

కాదండీ? ఇవాళేమో తోచడంలేదు" అన్నది రాధ.

"మరి ఎందుకలా వున్నావు! చెప్పకపోతే వీల్లేదు-చెప్పితీరాలి" అన్నాడు చంద్రం.

రాధ హైస్కూలు చదువు పూర్తిచేసింది. తరువాత పద్యగద్య కావ్యాలన్నీ చదివింది. మహిళా సమాజంలో ఉపన్యాసాలిచ్చి మెప్పుపొందింది. స్త్రీల సభలకు అధ్యక్షురాలు రాధే.

భర్త సరదాగా ఉన్నప్పుడు విద్యా విషయమైన వాదనవస్తే పైచెయ్యి రాధదే. నిన్ను లాయరుగా తయారుచేస్తే బాగా వాదిస్తావు రాధా? అంటాడు చంద్రం తన ఓటమి ఒప్పుగుంటూ. రాధ సునిశితమైన బుద్ధికి తెలివికి తనలో ఆనందపడుతూంటాడు. మంచి పుస్తకాలు తెచ్చిఇచ్చి రాధ విజ్ఞానాన్ని పెంపొందిస్తూంటాడు. వంటింట్లో నాలుగు గోడల మధ్య ఉండే స్త్రీలకు చదువూ సంస్కారం ఎందుకు! అనే వాళ్ళ జాపితాలో చేరడు చంద్రం. ఇన్ని సద్గుణాలుఉన్నా కోపంవచ్చినప్పుడు మాత్రం మనిషి గాడు. అతనికి కోపం కారణం లేకుండానే వస్తుంది. ఆ కోపం ఆట్టేసేపు ఉండదు. చంద్రం కేకలకూ బొబ్బలకూ సుధ అయితే హడిలిపోతుంది. రాధ చంద్రం ఎంత పెద్ద కేక వేస్తే అంత నవ్వుతాలుగా తీసుకుంటుంది.

చంద్రం ముక్తసరి మనిషి అయినా రాధ స్వభావం అతన్ని వాచాలుణ్ణిగా చేసింది. గుటకలు మ్రింగని చంద్రం నోరూరిపోతుంది – రాధనిబట్టి రాధ బలే చమత్కారి. మంచి వక్తకూడాను. అంత ధైర్యశాలిగనకే చంద్రంతో ఆట్టే గొడవరాదు రాధకి.

ఏం రాధా? మౌనంగా కూర్చున్నావు? ఏమిటి ఆలోచిస్తున్నావ్? "ఆ! ఏం లేదు సుధ విషయం ఆలోచిస్తున్నా.

"ఏమిటి జరిగింది."

రాధకి ఆవేశం ఎక్కువైంది. "సుధ భర్త సూర్యం స్వభావం మీరు ఎరుగుదురా!"

"ఏమో నాకు తెలీదు. ఏం అలా అంటున్నావ్"

"చెప్తా వినండి. పురుషులే స్వేచ్ఛా జీవులు. వారికి ఎవ్వరూ మంచిజెప్పే హక్కులేదు; భార్య ఏమి చెప్పగలదు!"

"ఏం! ఆడవాళ్ళు ఎందుకు చెప్పలేరు. స్త్రీ స్వాతంత్ర్యం పెరుగుతోంది గా! అసలేమిటి చెబుదూ."

"పురుషులు దయతలచి స్వాతంత్ర్యం ఇస్తే పెరుగుతోంది లేకపోతే తరుగుతోంది."

దేశస్వాతంత్ర్యంవంటిగొప్ప ఉద్యమమున్నా మహాత్ముడు సాధించేడుగాని స్త్రీ స్వాతంత్ర్యం మాత్రం ఏ మహాత్ముడు సాధించలేకపోయాడు.

అసలు కీలకం ఎక్కడుందంటే ఆర్థికంగా భర్త పోషించినన్నాళ్ళు ఏ స్త్రీకి ఇడుములు తప్పవు. అందుకే స్త్రీస్వాతంత్ర్యం స్త్రీ విద్యతోగాని రాదు. కొంతమంది పురుషులు భార్య పేరంటం వెళ్ళడమంటే ఇష్టపడరు. భార్య వీధి గుమ్మంలో నించోడం ఇష్టం ఉండదు కొందరికి. సూర్యానికి ఇంకో దుర్గుణం కూడా ఉంది.

సుధకి పూజా పునస్కారం చేసుగోడం అంటే ఆసక్తి. సూర్యానికి అది కిట్టదు. "భర్త సేవచేస్తే స్త్రీ తరిస్తుంది" ఇంకేమీ అక్కర్లేదంటాడు. అసలు సూర్యానికి దైవం ఉన్నాడంటే నమ్మకంలేదు. అందుకే సుధ దైవారాధన తలపెట్టిందంటే ఏదో అవాంతరం కల్పించి తీరుతాడు.

జీవితంలోసాగే ప్రతి చిన్న విషయానికీ, అంటే దైనందిన చర్యల్లో భర్తకూ తనకూ కలిగిన భేదాభిప్రాయాల గురించి చాలా బాధపడుతుంది సుధ. నిత్యం ఏదో ఒకదాన్ని పురస్కరించుకుని మనస్సు పాడుచేసుగోడం సుధకు అలవాటైంది.

ఆ విషయమే తలుచుకు తలుచుకు మరిచిపోలేక సీరియస్ గా తీసుగునే మనస్తత్వం సుధది.

'లక్ష్యంటే లక్కి' అంటాడేగాని భార్యపడే బాధ రవ్వంతైనా పట్టించుగోడు సూర్యం. ఎంత

గడ్డు సమస్యలు ఎదుర్కొన్నా దూదిపింజ తేలిగ్గా ఎగరకొట్టేవాడిలా దులపరించుకు తిరిగే స్వభావం సూర్యానిది.

ఇలా విభిన్న తత్వాలుగల దంపతులున్నారంటే, ఇంక ఆ యిల్లు ... ...

ఆ! ఇంకే ఆ యిల్లు ఎలా ఉంటుందో చెప్ప మంటారా? ఏం మీకు తెలియదా! నా చేతే చెప్పించాలనా? ఓహోహో! పాపం! మీకు క్రొత్తగా ఉందనుకుంటా?

మీరూ అంతేగా! అలాటి ఇల్లూ ... చెప్ప మంటారా? అంతకంటె నరకమే నయం. ఏం. ఔనంటారా? మాట్లాడరేం!

మనింట్లో గొడవరాదేమంటారా! ఎలావస్తుంది? శివుడు హాలాహాలాన్ని కంఠంలో దాచుకున్నట్లు మీ పేచీలన్నీ నేను కడుపులోనే దాచుకుంటాను. నేనన్న దానికి ఎప్పుడూ మీరు సమ్మతించరు. నేను కాదంటే మీరు ఔనంటారు.

బిచ్చగాడికివేసే భిక్షంగూడా నేను వేస్తూంటే మీరు వద్దని తీరుతారు. నేను పొమ్మంటే, వద్దూ, మనం ఏమీకట్టుకుపోం అంటారు. నేను మొండి మనిషిని గనుక మీతో వేగుతున్నాను. నేను సరి పుచ్చుకుపోయే మనిషిని.

మరి అంతా అలాగే సరిపుచ్చుకోవాలంటారా? నిజమే! కాని సుధ అలా సరిపుచ్చుకోలేదు. సూర్యం మరీ అన్యాయంలెండి. అతనితో చెప్ప కుండా ఏ పనీచెయ్యడానికి వీల్లేదుట. సోలెడు బియ్యం అప్పు తేవాలంటే అతనితో చెప్పకపోతే ఆ రోజు గొడవే."

3

రాధ ఇంకా చెప్పుకుపోతోంది. నేనలాగే వింటూ కూర్చున్నాను రాధ ఉపన్యాస ధోరణి.

మళ్ళా మొదలుపెట్టింది రాధ ఎందుకో వంట ఇంట్లోకి వెళ్లివచ్చి.

సుధ రేపు రథసప్తమి పాలు పొంగించుకోవా లని పని మనిషితో బెల్లం వగైరా తెమ్మని చెపు తూంటే సూర్యం ఇంటికి వచ్చాట్ట.

"రేపు అదంతా యేంమొదలు పెట్టకు, రేపు నేనూరికి వెళ్ళాలి. నీవు పొద్దున్న ఎనిమిదీ గంట లకే వంట చెయ్యాలి అన్నాట్ట". వట్టి బూటకం. ఎప్పుడూ ఏదో సాకుచెప్పి సుధ చేసేపనికాస్తా మానిపిస్తాట్ట.

తరువాత "ఇవాళ ప్రయాణంలేదు" అంటాట్ట ఇంతకుముందే మనింటికొచ్చి నాతో చెప్పి చాలా బాధపడింది సుధ.

"ఏమిటో! పుణ్యంకొద్దీ పురుషుడూ దానం కొద్దీ బిడ్డలూను" అంటూ బాధగా నిట్టూర్చింది రాధ.

"ఏమిటా విచారం రాధా. నువ్వే సుధవై పోతు న్నావ్. కొంచెం శాంతం అలవరుచుకోవాలి ఆడాళ్లు అన్నాడు" చంద్రం.

"ఏమిటీ! శాంతం అలవర్చుకోవలెనా! అవును మరి అలా కాక ఇంకెలా చెబుతారు. మగవాళ్లంతా ఒకటే.

శాంతంలేక ఆడది చేసేదేముంది? శాంతం పరిధి ఎంతవరకు? ప్రతిదానికీ మగవాడు అడ్డుచెపుతుంటే ఆడది బాధపడక ఏంచెయ్యగలదు చెప్పండి? సుధకి దైవభక్తి మెండు. సుధలాంటివాళ్ళని నాస్తికుల్లా కూచోమంటే ఎలా కూచోగలరు!

సుధ నాకు సాక్షాత్తూ మేనత్తకూతురాయె. బాధగా ఉండడం తప్పా-మీరే చెప్పండి. అయినా సుధ చాలా మంచి మనిషి.

భార్యా భర్త లిద్దర్లోనూ ఒకరైనా సర్దుకుపోయే వాళ్లయితేగాని సంసార శకటం సమంగా నడవదు. మొన్న మనం ఈ ఇంట్లోకి అద్దెకు వచ్చేటప్పుడు నేను ఇంత ఇల్లెందుకంటే విన్నారా! డబ్బుకు డబ్బూ ఎక్కువే. ఒక్కరోజు పనిమనిషి రాకపోతే

నేను ఒక్కదాన్ని ఊడ్చుకోడంకూడా చాలా కష్టం ఇల్లంతా.

"పెద్ద ఇల్లైతేం! నౌకర్లచేత చేయించుకో" అన్నారాయె! మహా ఇంటినిండా నౌకర్లుపడున్నట్లు.

"ఇంకోమాటు ఆ మాటన్నానంటే నేనున్నాగా! ఇంట్లో పెద్ద పాలికాపుని ఆజ్ఞాపించు, ఆ పన్లేవో నేనే చేస్తా" నంటారాయె. నా మాటఒక్కటి సాగనివ్వరు, సంగతి చెప్పాను. నేను బాధపడేదాన్ని కాదులెండి, ఎలాంటి పరిస్థితిలోనూ" అంది రాధ.

"ఔను మరి నువ్వు దాసీదాన్ని నేనున్నాగా. అంటే నేనేమనాలో నువ్వే చెప్పు రాధా?" చంద్రం అన్నాడు.

"భిన్న ప్రకృతులు మానవ సహజం. ఒకరి నొకరు అర్థంచేసుకుని సరిపెట్టుకుంటే పోతుంది. అలా కాకుండా పట్టుదల్లు పట్టుకుని వ్యవహరిస్తే నిజానికి దంపతుల్లో ఎవరిపంతమూ నెగ్గదనే చెప్పాలి. పురుషుని అధికారం పేరుకి మాత్రమే.

స్త్రీ పురుషునికి లొంగక తప్పదని నేను ఒప్పుకుంటాను. కాని మనిషిలొంగినా విధిలేక స్త్రీమనస్సు ఎంత ఘటికుడైనా లొంగదీయడం అసాధ్యం."

"తృప్తిగా, మనస్ఫూర్తిగా లేని కాపురాలు పాలులేని పాయసంలా ఉంటాయి."

"నీ ఉపన్యాసం చాలించుగాని, రేపు పాలు పొంగిస్తావా" చంద్రం అన్నాడు.

"పొంగిస్తాగాని రేపు సుధని దాని భర్తని మనింటికి భోజనానికి పిలుద్దాం. మీరు పిలిస్తే సూర్యం మనింటికి రానందు. రథసప్తమినాడు పాలు పొంగించుకోవాలని ఉత్సాహంతో ఉన్న సుధ నాతో పాటే సూర్యనారాయణమూర్తిని సేవించుకుంటుంది. ఏం, ఏమంటారు?" సమాధానంకోసం తొందర పెట్టింది రాధ.

"సరే. పిలుద్దాం! ప్రొద్దున్నే పిలుస్తాను. నువ్వన్నది కాదంటే నేనూ సూర్యాన్నే అయి ఊరుకుంటానేమో!"

"అబ్బే కాదండీ మీరు చాలా మంచివారు సరేనా?" మైరుపోసింది రాధ.

"ఓ! మహా ఇల్లాలువు. సీతా సావిత్రి మొదలైన భారత నారీమణుల అంశవల్ల జన్మించావు. నీలాంటి సాధ్వీమణుల పుట్టుకచేతనే భారతదేశం అన్ని దేశాలకన్న మిన్న అనిపించుకుంటోంది," చంద్రం నవ్వుతూ అన్నాడు.

అది సరేగాని చెప్పేది వినండి, "ప్రొద్దున్న పది గంటలకు వాళ్లు మనింటికి వస్తారు. అప్పుడు సుధా నేను కలిసి పాలుపొంగించుకుంటాం, ఈ సంగతి సుధతో చెప్పానులెండి" అంది రాధ

4

మర్నాడు రథసప్తమి, రాధ పూజాద్రవ్యములన్ని సిద్ధంచేసి వంట పూర్తికానిచ్చి సుధకోసం కని పెట్టుకూర్చుంది. సుధా సూర్యం లక్ష్మీనారాయణుల్లా పీతాంబరధారులై వచ్చారు. లోకం పోకడ తెలియని సూర్యం లోభి గనుక భోజనానికి పిలిస్తేచాలు ఖర్చు తప్పిందని సంతోషించాడు.

ఇలాంటి పర్వదినం ఇంట్లో పూజాదేవతార్చనా లేకుండా పై-చోటికి రావడం చెప్పరానంత బాధగా ఉంది సుధకి. లోపలే అణచుకుంది సుధ తన బాధ. రాధ రమ్మని పట్టుబట్టిందని దైవారాధన చేసుకో వచ్చునని ఎలాగో తృప్తిపడింది.

భర్తచేసిన తిరస్కారం తలుచుకుంటే సుధకి గుండెల్లో గతుక్కుమంటోంది. ప్రయత్నపూర్వకంగా సంతోషాన్ని కనబరుస్తోంది స్త్రీ స్వాతంత్ర్యానికి నోచుకోని సుధ. రాధా చంద్రం సుధని సూర్యాన్ని ఆహ్వానించారు. సుధ మొహం చూడగానే పోల్చుకుంది రాధ. ఆమె కళ్లల్లో ప్రతిఫలిస్తున్న దీనత్వంచూసి బాధతో క్రుంగిపోయింది. "పాపం సుధ చాలా అమాయకురాలు" అనుకుంది.

"సుధా! నువ్వూ నేనూకూడా మా ఇంట్లోనే ఇవాళ పూజాదికములు కానిద్దాం" అంది రాధ.

సుధ నవ్వింది వెలవెలగా. సూర్యం తలవంచేసుకున్నాడు. అతనికి తలకొట్టేసినట్లైంది. ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు, సుధ లోపలికి వెళ్ళింది.

కొంతసేపటికి "సూర్యం వడ్డనైంది రావోయి" అంటూ, చంద్రం పట్టుపంచ కట్టుగుంటూ వచ్చి పిలిచాడు. సూర్యం వంటగదిలోకి వెళ్ళేటప్పటికి సుధ నీరాంజనంతో సహా తులసెమ్మ దగ్గిరనుంచి భర్త దగ్గరకు వచ్చింది.

సూర్యం చంద్రంతో పాటు బలవంతాన హారతి కళ్ళకద్దుకున్నాడు. జారుముడిలో తొంగిచూస్తున్న గులాబీపువ్వు సుధ చెక్కిళ్ళ ఎరుపుతో కలిసిపోయింది! ఆమె ఆనందంతో నవ్వుతూంటే ఆమె నవ్వు పళ్లెంలో ఉన్న మల్లెపూలని పరిహసిస్తోంది. సూర్యం చంద్రం భోజనాలకు కూర్చున్నారు. రాధ వాళ్ళిద్దరికి వడ్డనచేస్తోంది. సుధకూడా వడ్డనకు సాయపడింది పాయసం పాత్రతో వచ్చి.

"సుధా! సూర్యానికి పరమాన్నం ఇష్టమేనా? సూర్య భగవాన్లుకు పరమాన్నం ప్రీతి అంటారు" వ్యంగ్యంగా అంది రాధ.

"వీరికీ ఇష్టమే! వీరు ప్రత్యక్ష దైవం మనకి" అంది సుధ నవ్వుతూ.

సుధ భావాన్ని గ్రహించి చంద్రం, "సూర్యనారాయణమూర్తే ఇవాళ మా యింటికి వచ్చాడు" అన్నాడు భక్తి ఉట్టిపడేలా.

"సుధా మీరూగూడా పండితులే" భర్తతో రాధ ఇలా అని "సుధా! నీ పేరు ఉపాదేవైతే ఇంకా బాగుంటుంది గదూ! అంది."

"నీ పాండిత్యం మాత్రం తక్కువా?" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"ఔ నన్నయ్యా మా ఒదినా పండితురాలే!" అంది సుధ.

ఆ క్షణంలో అందరి నవ్వులూ కలిసిపోయాయి భోజనాల దగ్గిర. సూర్యం మౌనంగా చిన్నినవ్వు నవ్వేడు తలయెత్తకుండానే.

భోజనాలైనాక తాంబూలాలు వేసుగున్నారు దంపతీద్వయం. చల్లబాటువేళదాకా పిచ్చాపాటీ చెప్పుగుంటూ కూర్చున్నారు. తరువాత సుధా సూర్యం ఇంటికి వెళ్ళిపోయారు.

"సుధా! ఇవాళ ఎంత ఉల్లాసంగా ఉన్నావ్. నీరాంజనం తీసుకొస్తూంటే నిజంగా నిన్ను చూస్తే భక్తమీరాబాయి జ్ఞాపకంవచ్చింది. పూజలన్నా దేవుళ్ళన్నా నీకెంత సంతోషం? ఇన్నాళ్ళనుండీ తెలుసుకోలేకపోయాను. నీ సంతోషాన్ని భగ్నంచేసాను. నా స్త్రీత్వణ్ణి, నన్ను క్షమిస్తావా సుధా! నీరాంజనం కళ్ళకద్దుకున్నాక నా హృదయం ప్రక్షాళితమైంది. ఇప్పుడు నామనస్సు అలలులేని సముద్రంలా నిర్మలంగా ఉంది. పశ్చాత్తాపంపొందిన నాకెవరో చేయూతనిచ్చినట్లు ధైర్యంగావుంది.

దైవారాధనవల్ల ఎంత సంతృప్తీ ఎంత ఆనందం ఉందో ఇప్పుడు కొంచెం తెలుసుగున్నాను. నీతో పాటు నేనుకూడా భగవంతుణ్ణి నమ్ముకుని ఎన్ని బాధలువచ్చినా ఎదిర్చేశక్తి సంపాదించాలని ఉంది సుధా! సూర్యనారాయణమూర్తి అనుగ్రహమే కాని నా హృదయపరివర్తనానికి ఇంకో కారణం ఏమీలేదు.

ఇప్పుడు నేనుకూడా భగవధ్యానంచేసుగుంటూ భగవద్భక్తితో ఆనందతరంగితమైన నీ ముఖకమలం చూస్తూ జీవితం గడపాలని ఉంది నమ్ముతావా సుధా?" అన్నాడు సూర్యం.

సుధ సంతోషానికి మేరలేదు. సుకుమారంగా సన్నని వేళ్ళతో ఉన్న చేతులతో భర్త పాదాలంటి నమస్కారం చేసింది.

"ధన్యురాల్ని ఈ నాటికి నా దైవానికి నామీద అనుగ్రహం కలిగింది" అంటూంటే సుధకళ్ళల్లోంచి ఆనందబాష్పాలు జారి సూర్యం పాదాలను తడిపేయి.

—○—

# తేలు పాము కాట్లనుండి రక్షణ

వైద్య శ్రీ ప్రకాశచంద్రశతపథి



మన దేశములో ప్రతియేటా వేలాది ప్రజలు తేలు, పాము, వెర్రికుక్క, ఎలుక, మున్నగువాటివలన చెప్పరాని బాధలననుభవిస్తూ యిహాన్ని వీడుతున్నారు. మరెందరో అనారోగ్యంతో సతమతమౌతున్నారు. విషజంతువులనుండి యింత మందికి ప్రాణాపాయం సంభవించకుండా చేయగల్గిన విధానాలు చాలా ఆయుర్వేదమునందున్నవి. కొన్ని సద్యః ఫలితాన్నిచ్చునవి. మరికొన్ని దీర్ఘకాలికంగా గుణాన్ని అగుపర్చేవి. వీటిని ప్రతివారూ తెల్సుకొనియుండడంవలన బాధితులు బాధలననుభవించకుండా సంరంక్షించగల్గుతారు. ఏ కొందరి విషయమో చెప్పజాలముగాని అందర్నీ అపమృత్యువునోటబడ వేయడమంటూ జరుగదు.

## తేలువిషమునకు :

తేలును చాలా సామాన్యమయినదిగా చాలామంది భావిస్తూవుంటారు. దాని కాటువలన యేదో కొద్దిబాధపడడంమినహా మరేమీ కాదనుకుంటారు. అది చాలా తప్పుడభిప్రాయం. తేలు, మండ్రగబ్బలలోకొన్ని పాములకన్నా ప్రమాదకరమయినవిగలవు. కొన్నికొన్ని తేళ్లు కాటువేస్తే మనిషి బ్రతకడమంటూవుండదు. మరికొందరు పడేబాధవర్ణనాతీతం గనుక తేలువిషయమై చాలాజాగ్రత్తగానుండాలి. ఏ తేలు యెంతటి ప్రమాదకరమైనదో తేల్చిచెప్పడం కష్టం.

1. పుష్యమీనక్షత్రమునాడు "తెల్లగలిజేరు" వేరును నీటితో నూరి మూడుసార్లు గైకొన్నట్టయితే ఒకసంవత్సరం వరకు వాని చెంతకు తేళ్లు, పాములు చేరజాలవు.
2. "పాతాళగరుడి" వేరును పుష్యమీనక్షత్రమునాడు చన్నీటితో నూరి సేవించిన అర్ధసంవత్సరం వరకు వారి చెంతకు పాములు, తేళ్లు చేరవు.
3. తేలుకుట్టినవెంటనే సైంధవలవణం చూర్ణం జేసి వెచ్చని నేతిలో కలిపి త్రాగించిన - తేలుకుట్టుటచే జనించిన ఆయాసము, వణకు, తాపము, తొలగిపోవును. విషము హరించును. ఈప్రక్రియతోబాటు యీ క్రిందియోగమునుకూడా ప్రయోగించిన తప్పక తేలు విషము హరించును.
4. మణిశిల, చెంగల్వకోష్టు, కానుగవిత్తులు, దిరిసెనవిత్తులు, కుంకుమపువ్వు వీటిని సమానముగా గైకొని చన్నీటితో నూరి మాత్రలుగాచేసి ఎండించి వుంచుకొనవలెను. ఆ మాత్రనొకదానిని నీటితోనూరి తేలుకుట్టినస్థలమున లేప

సము చేసిన విషముతప్పక హరించును. బాధ తొలగును.

5. తేలు కుట్టగానే జిల్లేడుపాలు కుట్టిన చోట పూసిన తీవ్రమయిన బాధ శమించును.

6. కుక్కగొడుగుగాని మొండిచెయ్యిగాని (ఇవి కొన్ని కొన్ని తావులందు పుట్టును) నీటితో ఉంగరమువలె జేసి చేతికి ధరించిన తేలుకుట్టినబాధ తొలగును.

7. దిరిశెనచెట్టు పట్ట కషాయం త్రాగించిన చాల ఉపయోగకరముగానుండును.

8. శాకి దొండవేరు గంధమును తేలుకుట్టిన తావున పూసిన బాధశమించును.

గమనిక : తేలుకుట్టగానే యీ ప్రయోగములలో యేదిచేయ వీలుకల్గిననూ, కలుగకపోయిననూ మూడ వ క్రియ నేతితో సైంధవలవణమును చేర్చి త్రాగించడం ముందుగా జరిపించడం చాలా మంచిది. అవసరం. తదుపరియే ప్రక్రియ నైన అనుసరించవచ్చును. నాల్గవయోగం చాలామంచిది. ప్రతి వారూ దగ్గర ఉంచుకొనవలసినది.

---

### సర్ప విషమునకు :

1. పాము కరువగానే ''పాతాళగరుడి'' వేరును చూర్ణంచేసి గోరు వెచ్చటి నీటితో గైకొనడంవలన సర్పవిషబాధ శమించును. పానము చేయజాలని స్థితిలోనున్న యీ చూర్ణమును నస్యం చేయడంగాని, అంజనముగా నుపయోగించడంగాని జరిపించవచ్చును.

2. జిల్లేడు వేరు పైగల పట్టను గాని, ఉమ్మెత్త వేరు పైగలపట్టనుగాని చల్లటినీటితో నూరి సర్పదష్టునకు వెంటనే త్రాగించినందువలన విషతీవ్రతతగ్గును. కొందరికి ప్రాణహానియూ తొలగిపోవును.

3. మునుగు దామరవేరును బియ్యవు నీటితోనూరి త్రాగిన చాలా సర్పముల విషము హరించును.

4. పాముకరచినవానికి వెంటనే ''మనిషి నీరుడు (మూత్రము)ను త్రాగించిన విషతీవ్రత తగ్గును.

5. చిరుతపులి దంతముచే గరుడవిగ్రహమును చేసి ఆ విగ్రహాన్ని శరీరమున ధరించుచుండిన అట్టివారికి సర్పముల వలన కీడుచేకూరదు. అట్ట్ వ్యక్తుల సమీపమునకు సర్పములు దరిచేర కుండును.

6. పాతాళగరుడి వేరునుగాని, తెల్లగలిజేరు వేరునుగాని పుష్యమీనక్షత్ర దివసమున నీటితోనూరి పానముచేసిన వారి చెంతకు పాములుదరిచేరవు.

### పిచ్చి కుక్కకాటునకు :

1. ఉమ్మెత్త చెట్టు సమూలంగా దంచి తీసిన రసం 2 తులములు, పాలు 2 తులములు, నేయి 2 తులములు, బెల్లము 2 తులములు కలిపి త్రాగించిన పిచ్చి కుక్క విషము హరించును.

ఇతర విషములను గూర్చి పరిశీలన జరుగుచున్నది. మున్ముందు తెల్లము చేయుడమగును.

# బుద్ధం శరణం గచ్ఛామి

## శ్రీ నాయుడు వెంకటసీతారామమూర్తి

పూర్వకాలంలో కాశీరాజ్యాన్ని బ్రహ్మదత్తుడు అనే రాజు పాలిస్తూఉండేవాడు. ఈతనికి భూసురులపై భక్తిమెండు. వారు ఏమని చెప్పినా శిరసావహించేవాడు. దానికితోడు భూత ప్రేత పిశాచాలంటే యీతనికి భయం ఎక్కువ. ఈ అవకాశాన్ని వినియోగించుకునేటందుకు పురోహితులు అనేకమైన దానధర్మాలను, యజ్ఞయాగాదులను శాంతులనూ అవసరం లేకపోయినా జరిపించి తద్వారా వారు లాభంపొందేవారు. రాత్రివేళలందు కాకులు అరచినా, విచిత్రస్వప్నాలు వచ్చినా, తోకచుక్క భూమిమీద పడినా రాజుచేత అనేకమైన యజ్ఞయాగాదులను చేయించేవారు. అలా వెచ్చింపబడిన ద్రవ్యమంతా కొందరు స్వార్థపరుల చేతుల్లోనే పడేది. ఈ విధంగా రాజుగారి ఖజానాలో డబ్బంతా ఖాళీఅయ్యే పరిస్థితికికూడా వచ్చింది. అమాయకుడైన భూపతి తానుచేసేదంతా సత్కార్యాలకే వినియోగింపబడుతున్నదనీ, తన ప్రజల యోగక్షేమాలకే తాను పాటుబడుతున్నాననీ భావించేవాడు.

ఒకనాటి నిశిరాత్రి నగరులో ఎనిమిదిరకాల వింతశబ్దాలు వినిపించేయి. వాటిని వినేసరికి రాజు హడలిపోయాడు. వెంటనే పురోహితులను రప్పించి సంగతంతా చెప్పి కర్తవ్యం ఏమిటన్నాడు.

"మహారాజా? ఈ శబ్దాలు రాచకుటుంబానికే కాక నగరవాసులందరికీ అత్యంత అశుభదాయకాలు. బృహత్తరబాదరామాయణ మహాతంత్రాంగంలో దీనికి చేయవలసిన శాంతి వివరంగా విశదీకరించబడింది. యిందుకు అగ్నిష్టోమయజ్ఞాన్ని చేయాలి నూరుమంది ఆచార్యులు, వేయిమంది పూజారులు, రప్పించబడాలి. పదివేల పశువులను బలియివ్వాలి. నూరువేల బ్రాహ్మణులకు పంచభక్ష్యపరమాన్నాలతో షడ్రసోపేతంగా సంతర్పణ సంతృప్తికరంగా జరిపించాలి. యిదే చేయవలసినతంతు" అని పురోహితులు వివరించేరు. రాజు అంగీకరించి అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ వెంటనే చేయించమని మంత్రికి ఆజ్ఞాపించేడు.

ఏర్పాట్లన్నీ చురుకుగా సాగుతున్నాయి. నెయ్యి కొరకు ఒక పెద్దచెరువు తవ్వబడింది. యజ్ఞానికి పదివేల పశువులు సిద్ధంచేయబడ్డాయి.

ఈ సంగతంతా నగరానికి ఆవల ఒక వనంలో నివశిస్తున్న బిక్షువు తెలుసుకుని "ఘోరా! రాజు ఎంతటిక్రూరత్వానికి పాల్పడుతున్నాడు.? నిర్దాక్షిణ్యంగా పదివేలపశువులను బలితీసుకుంటున్నాడు. ఈ రాజుకు గుణపాఠంనేర్పి జంతుబలిని ఆపించాలనే" సంకల్పంతో ఆస్థానంలోనికి వెళ్ళి రాజును సందర్శించేడు.

"ఆపురాజా! ఆపు! ఈ జీవహింసను ఆపు. యిప్పటికే మితిమీరిన జంతుబలిని అమలు జరిపేవు. యిప్పుడు పదివేలజంతువులను బలిగొంటున్నావు. ఈ పాపమంతా నీకు తగలకతప్పదు" అని బోధించేడు

"అదేమిటి స్వామీ? యిదంతా నా స్వార్థానికీ, నా పుణ్యానికీ కాదుగదా! యిదంతా ప్రజాక్షేమానికీ నగరక్షేమానికేగదా?" అని వినయంతో విన్నవించుకున్నాడు.

"ఎంత అమాయకుడివిరాజా! నీవు చేసేది ఎవరికోసమైనా అదినీపేర చేయించబడుతున్నది కావున దాని ప్రతిఫలం నీకేచెందుతుంది. నీ ఆస్థానంలోని పురోహితుల మాటలను నమ్మి వారిమాటనే చెల్లిస్తున్నావు. యిప్పటికైనా మించిపోయిందిలేదు. యీ ఆఘాయిత్యాన్ని ఆపు" అని బోధించేడు.

"స్వామీ! ద్విజులమాటలు పొల్లులు కావుకదా! ఒకనాటిరాత్రి ఎనిమిది భయంకరమైన శబ్దాలు విని

పించేయి. వాటి శాంతికే యీ యజ్ఞాలూ యాగాలూను" అని వివరించేడు.

"నాకు తెలుసు రాజా ఆ వింత కూత అర్థాలు. వాటివల్ల నీకుగాని నీ ప్రజలకుగాని ఏవిధమైన అనర్థాలు రావు. ఆ నాటిరాత్రి మొదట నీవు విన్నది గబ్బిలము శబ్దముకదూ ?"

"అవును స్వామీ ! అవును" రాజు బుర్రూపేడు.

ఆ నాడు గబ్బిలములు మీ తోటలోని పండ్లను తింటున్నాయి. కాని తోటమాలి వలతో చెట్లను కప్పివేసినందున అవి చింతిస్తూ "ఎక్కడా దొరక్క ఆహారంకొరకు ఎంతో దూరాన్నుంచి యిక్కడకు వచ్చేం. రాజుగారితోటలోకూడా ఆహారం లభించకపోతే యింక మాగతేంకాను" అని విలపించేయి రాజా !

రాజు నిర్ఘాంతపోయాడు.

"రెండవ శబ్దం కాకికూత. మీ హస్తిశాల ద్వారంపై ఒక కాకి గూడు కట్టుకుంది. మావటివాడు ఆ గూడును పడగొట్టి అందులోని గుడ్లను అవతలపారవైచేడు. తన సంతానాన్ని నాశనంచేసినందుకు ఆ మాతృహృదయం ఆ రాత్రి తెల్లవార్లూ విలపించిందిరాజా !" మూడవది "ఆవు అరుపు. తన బిడ్డకు కడుపు నిండకుండా ఒక్క చుక్కనైనా మిగల్చకుండా పాలను పితుక్కుపోతున్నారని ఆ ఆవు కన్నీరుకారుస్తూ అరచింది." "నాల్గవది కోకిల కంఠం. నన్ను బంధించి నాకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని లేకుండా చేశారు. నా కెవరుదిక్కు ?" అని విచారవదనంతో విలపించింది. "అయిదవది హరిణశబ్దం. వింధ్యపర్వతాల్లో ఎంతో స్వేచ్ఛగా నివశించేదాన్ని. ఈ నాడు రాజు చేతిలో బంధీకావలసివచ్చింది." అని ఏడ్చింది. "ఆరవది వానర శబ్దం. నా దోషం ఏమిలేకపోయినా నన్ను బంధించేరు యీ రాజ భటులు. నరులకు మతిపోయినట్టుంది" అని వాపోయింది. "ఏడవది గుఱ్ఱపు సకిలింపు. "నాకు పెట్టే అహారాన్ని సైతం రాజు భటుడు దొంగలిస్తున్నాడు. నా కష్టానికి ప్రతిఫలం యివ్వకుండా ఉన్నాడు. ఎంత విశ్వాసహీనుడు రాజు" అని సకిలించింది. రాజా !" అంతిమ శబ్దం నా గానం. రాజు కేవలం అ పాత్రులకే దానం చేస్తున్నాడు. స్వార్థపరులైన పురోహితులు రాజును బాగా ఉపయోగించుకుంటున్నారు. రాజుకు సద్బుద్ధికలుగుగాక ! ధర్మమును అహింసను అవలంబించుగాక ! దుర్జనులనుండి స్వార్థపరుల నుండి రక్షింపబడుగాక" అని పాడేను. "అవే మీరు విన్న శబ్దాలు. యిప్పుడైనా అర్థమైందా రాజా ? మీకు చేస్తున్న పొరపాటు !" అని వివరించేడు.

రాజుకి జ్ఞానోదయం కలిగింది. ఆ బిక్షువుకు సాష్టాంగ దండప్రమాణం ఆచరించి "నన్ను రక్షించేరు స్వామీ ! నాకు జ్ఞానభిక్షను ప్రసాదించేరు. మీ రెవరు ?" అని ప్రశ్నించేడు.

"నన్ను బోధిసత్త్వుడంటారు" అన్నాడు ఆ బిక్షువు.

"బుద్ధ భగవానుడా ! నన్ను రక్షించు" అని బుద్ధుని పాదాలను కౌగలించుకున్నాడు రాజు.

"లే నాయనా ! పశ్చాత్తాపమే నీ పాపాలకు ప్రాయశ్చిత్తం. జీవహింసనుమాను. నీ శరీరాన్ని నువ్వు ఎంతగా ప్రేమిస్తున్నావో యితరులనుకూడా ఆ విధంగానే ప్రేమించు. అదే నీకు మోక్షసాధనం" అని హితబోధచేసి వెళ్ళిపోయాడు.

ఆ నాటినుంచి రాజు జీవహింసను మాన్పించేడు. ఆస్థానంలోని పురోహితులను తగిన రీతిగా మందలించేడు. తోటలోని చెట్లపై వలలను తీసివేయమని భటులకు ఆజ్ఞాపించేడు. మావటివానిని పిలిపించి శిక్షించేడు. పాలు పితికేవానిని పిలచి దూడకు కావలసిన పాలను వదిలివేయమన్నాడు. కోకిలను, వానరాన్ని, హరిణాన్ని విడిపించేడు.

—(౦)—

(256 వ_పేజి తరువాయి)

పైన చెప్పబడిన విలువగల హామీపత్రములు అనగా భారతశిక్షా స్మృతిలోని (Indian Penal Code) Central act XLV of 1860) 30.వ శెక్షనులో చెప్పబడిన అర్థమే యిచ్చుటగూడ అన్వర్తించును.

ఈ చట్టము అమలులోనికి వచ్చుటకు పూర్వము అమలులోవున్న కట్నమిచ్చుట పుచ్చుకొనుటలకు సంబంధించిన ఆచారములుగాని, ఏ న్యాయసూత్రములుగాని, అలవాటుగాని అవన్నియు యీ చట్టము అమలులోకి వచ్చిన దర్మిలా న్యాయ విరుద్ధముగా పరిగణించబడును.

కట్నము యిచ్చుట పుచ్చుకొనుటలకు సంబంధించిన అన్ని ఒడంబడికలు, వ్యవహారములు వదలివేయవలయును. (శె. 4. (1) )

ఈ చట్టముక్రింద జరుగు నేరములు రాజీపడుటకు వీలులేదు. (Non-compoundable) (శె. 4. (2.) )

ఈ చట్టముక్రింద జరుగు నేరములను ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చుటకు, పితూరీ చేయుటకు ఎల్లరకునూ హక్కుగలదు. (Non-cognizable) మఱియు యీ చట్టముక్రింద జరుగు నేరములు జామీనుపై విడుదల చేయదగినవి. (bailable) (శె. 5.)

నేరము జరిగిన తేదీనుండి ఒక సంవత్సరములోపుగా ఫస్టుక్లాసు మేజస్ట్రేటువారి కోర్టునందు, పితూరీ చేసినప్పుడు మాత్రమే నేరములు విచారింపబడును. (శె. 6.)

ఎవరైన కట్నము యిచ్చినను, పుచ్చుకొన్ననూ యిచ్చుటనుగాని పుచ్చుకొనుటనుగాని ప్రోత్సహించిననూ అట్టివారికి ఆరునెలలకు మించని జైలుశిక్షగాని, లేక జైలుశిక్ష, జరిమానా రెండూగాని విధించవచ్చును. (శె. 7.)

ఈ చట్టముయొక్క ఉద్దేశ్యము లన్నియుగాని, కొన్నింటినిగాని అమలు జరుపుటకై 'ఆంధ్ర గెజెట్' లో ప్రకటించి కొన్ని రూల్సు చేయుటకుగాను రాష్ట్రప్రభుత్వమువారికి అధికార మీయబడినది. (శె. 8. 1.)

అట్లు చేయబడిన రూల్సు సాధ్యమైనంత త్వరలో శాసనసభవారి ముందుంచ వలయును. ఆ సమావేశములోనే అట్లుంచబడిన 14 దినముల లోపుగా వాటిపై చేర్చి వేతలుగాని చెరిపి వేతలుగాని చేయవచ్చు, (శె. 8. (2,)

కొద్దిమంది వ్యతిరేకించిననూ 'ఆంధ్రప్రదేశ్' శాసనసభలో అన్నిపక్షములవారునూ బిల్లును బలపర్చి ఏకగ్రీవముగా ఆమోదించడములో నిజముగా అభినందనీయులు. దేశమంతటనూ పీడించుచున్న ఈ సాంఘిక దురాచారమైన వరకట్నాల నిషేధానికి శాసనాన్ని నిర్మించిన తొలిరాష్ట్రము 'ఆంధ్రప్రదేశ్' కాగలిగింది. అఖిలభారత దేశమునకే సంస్కరణలో మార్గదర్శకత్వము వహించినది. పైగా ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరము అమోదింపబడిన మొదటిబిల్లుకూడ యిదే. కేరళ రాష్ట్రములోకూడ ఈ వరకట్న నిషేధపుబిల్లు త్వరలో శాసనమయే సూచనలు మనం పత్రికలలో చదువుచున్నాం. అచ్చటి ప్రజలుకూడ ఆదర్శవంతముగా శాసనమునకు చేయూతనీయగలరని ఎదురుచూద్దాం.

"సమాజములో దురలవాటుగా భావింపబడుతున్న మద్యపానముమీద నిషేధము పెట్టగా-దురలవాట్లకు లోనైనవారిని పట్టివ్వలేని సంఘములో కట్నము తీసుకోవడమే ఘనతగా భావించుచున్నప్పుడు ఈ దురాచారము మాన్పశక్యమా?" "బాల్యవివాహాలను నిషేధిస్తూ శారదాచట్టము వున్నప్పటికి దేశములో బాల్యవివాహాలు జరగడము మటుకు అరికట్టబడ్డాయా?" అనేవి కొందరి సందేహాలు. వరకట్నాలు "బ్లాక్ మార్కెట్"లో జరుగుతూ ఇహనుంచి లగ్నాలకుముందే కట్నంకానుకలు పుచ్చుకోవడమూ, కట్నమిస్తేనేకాని సూత్రధారణ జరుగదనే బాధా పూరిత సందేహములు వెలిబుచ్చుతున్నారు. "తెల్లకాగితమును శాసనపత్రముగా మార్చినట్లుగ మానవుల హృదయాలను మార్చగలరా?" "చట్టాన్ని పెట్టి శాసించగలరుకాని, చేతులుకట్టి మాన్పించగలరా?" అనేవి మరికొందఱి సందేహాలు. అయితే శాసనము చేసినంత మాత్రమున ఒక్కరోజులో

సమస్య తీరిపోతుందనిగాని, లేక ఈ సమస్యా పరిష్కారమునకు శాసనమే పరమసాధన శరణ్యమనిగాని ఎవరూ అనుకోరాదు" శాసన నిర్మాతలుకంటె శాసనధిక్కారకులే ఎల్లప్పుడూ ముందుంటారు. (Law breakers arealways ahead of law makers) అనే సామెత మనలో వుండనే వుంది.

బిల్లును ప్రవేశపెట్టిన శ్రీ కాశీశ్వరరావుగారే బిల్లు చివరిభాగములో "ఈ బిల్లు శాసనమైన తరువాత ప్రజలయొక్క పూర్తి సహకారముతో ఒక గొప్ప సాంఘిక దురాచారమును నిర్మూలించగలదని నమ్ముచున్నాను" - అన్నారు. ప్రజలలోగల ఒక తప్పును తప్పనియు అది చేసినవారిని శిక్షింతుమనియు ప్రకటించుట ప్రజాపాలకులైన ప్రభుత్వము వారి విద్యుక్త ధర్మము మాత్రమే కాగలదు. ప్రజలలో నైతికమైన మార్పును సాధించుటద్వారా యీ దురాచారమునుండి విముక్తులగుటకు మనము ప్రయత్నించవలెను. మానవ ఈ హృదయ పరివర్తనకు సంఘ పరివర్తనమని గుర్తించవలెను. ఆచారమును దురాచారముగా భావించినప్పుడు దాని నరికట్టే ప్రయత్నమూ, నీతి - నియమమూ మనలకు కలగాలి. కాని మన ధర్మమును. బాధ్యతను మనమే విస్మరించి ప్రభుత్వమైనా తన బాధ్యత తను నిర్వర్తించుచున్నందులకు ఓర్పులేనినాడు సమాజము సర్వనాశనము కాక తప్పదు. ప్రజలలో వరకట్నపిశాచి చేయుచున్న యమతాండవము ప్రజాప్రతినిధులకు, తదితర నాయకులకు, సంస్కార ప్రియులకు తెలియనిదిగాదు. ఏ ఆశయముతో మన ప్రజాప్రతినిధులు శాసనము గావించినారో తదాశయరీతికి అనుకూలముగా వారు కడు ఆదర్శప్రాయముతో ఆచరించి దురాచార స్వేచ్ఛా విహారమును అరికట్టుటకై తీవ్రకృషిచేసి ప్రజలకు మార్గదర్శకులు కావలెను. శాసనము చేయుటవరకే మన బాధ్యతని విస్మరించిననాడు ఈ దురాచారపు దురంతాలకు, దుర్నీతికి అంతుండదు. సమాజమును త్వరితగతిలో ఈ ఘోరఉపద్రవమునుండి తప్పించని యడల యిది మానవజాతి మారణహోమానికే దారి తీయగలదనుట నిస్సందేహము. ఈ దురాచారము పూర్తిగా రూపుమాపుటకు శాసనసహాయమేకాకుండా వైజ్ఞానిక ప్రబోధ ప్రచారములుకూడ ముఖ్యావసరమైయున్నది. యువజనులు తల్చుకున్నచో ఏమైననూ సాధించగలరు. కాబట్టి ప్రజలు సత్వరమే మేల్కాంచి కట్నపిశాచిని రూపుమాపుటకు దీక్షబూనవలెను.

"ఈ అణవస్త్రాలు యీ మారణాయుధాలు యీ భూఖండముమీద యిక మానవజాతి వుండదేమోననే భీతిని కల్గిస్తున్నాయి. అది జరగటానికి ఆస్కారమేమీలేదు. కానీ - యింతకంటె భయదమైన పరిస్థితి యేమిటంటే, తనకున్న సంస్కృతి సంప్రదాయములనూ నాగరికతనూ మానవత్వముతో సహా సర్వనాశనముచేసుకుని మానవుడు మృగముగా తిరిగి యీ గడ్డమీద మిగులుతాడేమోనని నా భయం" — అంటూ వెలిబుచ్చాడో మహనీయుడైన ఇంగ్లీషు శాస్త్రవేత్త. అట్టి అపదరాకుండగ ఈ అమూల్య సందేశమును మనము జీర్ణింపజేసుకుని సంచరించవలసిన బాధ్యత మనది.

అవినీతిగా ప్రవర్తించే తల్లిదండ్రులకు మాత్రము కుమార్తెలులేరా? వారికి మాత్రము కరుణలేదా? ఏ ఒక్కరి కరుణా శాంతముగా కూర్చోనీయదుకదా. ఒక అల్పజీవి హింసింపబడి అతని రక్తము చిందితే మానవజాతి సహిస్తుందా? తల్లిదండ్రులారా! హృదయ పూర్వకముగా యికనైననూ వరకట్నాలు పుచ్చుకోమని ప్రతిన బూనండి. సంబంధాలు నిశ్చయించుకుని, ముహూర్తాలు నిర్ణయించుకున్న పిదప ఎవరైననూ అదనముగా కట్నాలు కానుకలూ ఇచ్చే ఆశ, అవకాశము కల్గిస్తూంటె వారికే ప్రాధాన్యత నిచ్చే మీ మనస్సులు మార్చుకోండి. ఈ రోజులలో జరిగే వివాహములకు మూడు ముళ్ళు పడేంతవరకు నిశ్చయమని తలంచడానికి వీల్లేకపోతోందనే సంశయాన్ని తొలగించండి. ఈ కట్నాలు మూలము గానేకదా ఎన్నో కుటుంబాల మధ్య పరస్పర వైమనస్యాలు పెరిగి పీటలమీది పెండ్లిండ్లు సైతమూ తప్పిపోవడమని గుర్తించండి. "షైలాక్" తత్వాన్ని

అవలంబించింది - మానవత్వం మైమఱచి - మన కుమారులకే ద్రోహాలం తలపెడుతున్నామని తెలుసుకోండి. "మా కుమార్తెలకు కట్నమియ్యము - మా కుమారులకు కట్న మంగీకరించము"ని ఈ రోజునే నిర్ణయించుకొని వివాహమునకుగల పవిత్రతను వరకట్నాల మూలముగా నిష్కళంకముచేయక కాపాడండి. యువకులారా!! ఇందులో మీ పాత్ర ఎంతైనా వుందని గుర్తించి ముందంజ వేయాలి. చైతన్యం రావాలి. మీ భావాలు సంఘసంస్కరణలవైపు మరలాలి. దురాచార నిర్మూలనకు తరలాలి. వరకట్నాలకు బానిసలం కాకూడదని-పశువుల్లా అమ్ముడుబోమని ఈ రోజునే కృతనిశ్చయులు కావాలి.

కలకాలమునుంచి ఆశించియున్న వరకట్న నిషేధ శాసన మహాస్వప్నము నిజముచేసుకున్న ఆంధ్రజాతి యింకా మున్ముందుకు పురోగమించి యింకెన్నో స్వప్నాలను సాధించుకుంటుందిగాక. గతమెంతో ఘనకీర్తిగల్గిన ఆంధ్రభూమి భవిష్యత్తులో మహోంధ్రయై భారతజాతికి వన్నెతెచ్చుగాక - అన్నదే యీ విజయోత్సవ సమయమున ముక్కోటి ఆంధ్రుల ప్రవిత్రాశయము.

"చుట్టూరా ఆవరించివున్న చీకటిని ఊరికే తిట్టుకుంటూ కూర్చోకండి; ప్రయత్నించి ఒక చిన్న దీపాన్ని - ఎంత చిన్నదైనా సరే! - వెలిగించండి".

---

(240 వ-పేజి తరువాయి)

సరస్సుకు వెళ్తుంటే ఒక మంగలి తన సంపాదనకొరకు, ఆతోట ప్రక్కగా వెళ్తున్నాడు. రాజుగారు వాణ్ణిచూచారు. రాజుగారు హడావుడిగా వెళ్తూ అక్కడున్న దుంగకు తట్టుకొనిపడ్డాడు. ఇంకేముంది రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదువా?

మంగలిని పిలిపించారు. రాజుగారు మంగలిని ఉద్దేశించి "ఓరీ పాపిష్టి మొహమా! పొద్దుటే నీ మొహంచూడబట్టి నాకాలు పచ్చడిపచ్చడిగా చితికింది. నీవు బ్రతికి ఉంటే నీ మోహంచూచి ఎంతమంది అభాగ్యులు బాధపడాలో! కనుక నీకు శిరచ్ఛేదనే!" అన్నారు.

చచ్చేవాడికి మొండిధైర్యంట. ఎటూ శిరస్సుపోతున్నది. గనుక మంగలి రాజుకు సవినయంగా నమస్కరించి "రాజా! నా మొహంచూస్తే మీకు కాలునలిగింది. తమరి మొహం చూచినందుకు నాకు శిరచ్ఛేదన. ఇంకాసేపట్లో శిరస్సే ఎగిరిపోతున్నది కనుక నాకంటే మీరే ఎక్కువ ప్రమాదకారులు" అన్నాడు. ఈ మాటలతో రాజు లజ్జపడి మంగలిని విడుదల చేశాడు.

కనుక బాలలూ! మీరెవర్నీ అనకండేం! వాళ్లుకూడ అదే అంటారు. జాగ్రత్త!!!

(o)——

# బ్రహ్మాండమైన ప్రాజెక్టులు

## బృహత్ ప్రయోజనాలు

బీడులు నింపి పంటలకోసం పొలాలకు తగిన నీరు—గృహాలకు విద్యుచ్ఛక్తి.

చిన్నా, పెద్దా పరిశ్రమలు నడపడానికి విద్యుచ్ఛక్తి—అనేకానేక ప్రయోజనాలు సమకూర్చడానికి భారతదేశంలో బ్రహ్మాండమైన నదీలోయ ప్రాజెక్టులు నిర్మిస్తున్నారు.

భాక్రా - నంగల్, హిరాకుడ్, తుంగభద్ర, దామోదర లోయ, చంబల్, మయూరాక్షి మొ॥ ప్రాజెక్టులు నిర్మించడం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని బ్రహ్మాండమైన కార్యక్రమం.

**ప్రణాళిక** పురోగతి

సంపదలకూ, సర్వతోముఖాభివృద్ధికీ—



# సంపాదకీయములు

## అన్ని వర్గాలకు ఉచిత వైద్యసహాయం

భారతప్రధాని పండిత నెహ్రూ యావద్భారతంలో అన్ని వర్గాల ప్రజలకు ఉచిత వైద్యసహాయము సమకూరవలెనని ఆశించడము, అందుకుగాను డాక్టరులను గ్రామాలకుపోయి సేవచేయవలసినదిగా ఉద్బోధించడము ప్రధాని ఔదార్యమును, విశాల హృదయమును చాటుచున్నది.

కాని ప్రస్తుతము డాక్టర్లు పట్నవాసములలో తమకు అమరియున్న ఆదాయవసతులను, పరిసర వాతావరణమును వదలుకొని అంతకంటె ఆదాయవసతులుగాని, మిగతావకాశములుగాని లోపభూయిష్టముగానున్న గ్రామీణప్రాంతములకు పోవలసినదిగా ఉద్బోధించినా ఏమంత లాభముండదు.

అయితే ప్రభుత్వ సహాయసహకారములతో వైద్యకళాశాలల సంఖ్యపెరిగి, దాంతోబాటు ఉత్తీర్ణులయే వైద్యుల సంఖ్య పెరిగివచ్చే వారివారి దృష్టిని గ్రామాలవైపుకు మరలి ప్రజలకు వైద్యసహాయ సౌకర్యములు విస్తృతంకాగలవు.

దీనితోబాటు చాలీచాలని ఇంగ్లీషువైద్య వసతులకంటె మిన్నగా ప్రజలవైద్య సౌకర్యాలకు తోడ్పడుతున్న దేశీయవైద్య విధానమును ప్రోత్సహించి ఎక్కువమంది వైద్యులు సుశిక్షితులై ప్రజల ఆరోగ్యసౌభాగ్యములకు తోడ్పడుట అభిలషణీయము.

వైద్యవసతులు విస్తృతం కావాలంటే ప్రజలు సేవారంగంలో దిగనున్న డాక్టరులకు ఆకర్షణీయమైన జీవనమును, విద్యాభ్యాసమునకు వసతులను సమకూర్చవలసియున్నది.

ప్రజలు సయితము తమవైద్యావసరములను గుర్తించి, అమరినవానిని వినియోగించుకోడం సయితం నేర్చుకోవాలి.

## సంక్షేమ కార్యక్రమ నిర్వహణ

గ్రామాలలో సంక్షేమ కార్యక్రమ నిర్వహణకు మహిళలను నియమించాలనే సూచన వెలువడింది.

సంక్షేమ కార్యక్రమాల నిర్వహణ పేరుతో యింతవరకు వెచ్చించబడిన మొత్తాలకు, సాధించిన విజయాలకు సాపత్యములేదనేమాట ప్రతిమూలనుండీ వింటున్నాము. ఇకమరి యీ సంక్షేమకార్యక్రమాలకని నిర్వహణకని అనవసరంగా డబ్బువెచ్చించడము ఎందుకో తెలియదు.

సంక్షేమ కార్యక్రమాలలో - గ్రామీణప్రాంతములలో విద్యావిజ్ఞానముల పెంపుజేయుట, కుటుంబ ఆదాయము పెరిగే అవకాశములను నేర్పుట. ఆరోగ్య, వైద్యవసతులను సమకూర్చుకొని సద్వినియోగం చేసికొనుట, శుచిశుభ్రమైన ఆహార నివాసవసతులను సమకూర్చుకొనుట, ప్రతిగ్రామంలోను ప్రజలు సమరస సమైక్యతలతో పరస్పర సహాయ సహకారముల నెరపుకొనుచు, పదిలమైన సౌభాగ్యవంతమైన కుటుంబ జీవితమును నిర్మించుకొనుట నేర్పుట ప్రధానమైనవి.

సంక్షేమ కార్యక్రమాలు పైవానిని దృష్టిలోనుంచుకొని రూపొందినచో వానిని స్త్రీలు, పురుషులు నిర్వహించి ప్రజోపయోగం చేయవచ్చును. అధికార, అనధికార వర్గాలసహాయ సహకారములను సేకరించి ప్రజల సౌభాగ్యానికి వినియోగపరచినచో తప్పక సత్ఫలితములుండగలవు. ప్రజాసంక్షేమం పేరుతో ప్రజల డబ్బువృథా కావడం వాంఛనీయం కాదు.



## శ్రీ విళంబినామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠమాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | శు | త్ర 36-29 అశ్వ 60-0 మాసశివరాత్రి |
| | 17 | శ | చతు 42.11 అశ్వ 2.50 |
| | 18 | ఆ | ● అమా 44-58 భ 48-17 |
| | | | **జ్యేష్ఠమాసము** |
| 1958 సం॥ మే నెల | 19 | సో | శుపా 47-14 కృ 13.13 |
| | 20 | మం | వి 49.31 రో 16-50 |
| | 21 | బు | త 48.58 మృ 19-14 |
| | 22 | గు | చ 47-0 ఆర్ద్ర 20.22 |
| | 23 | శు | పం 44.30 పున 20-14 |
| | 24 | శ | ష 40.58 పుష్య 19.1 |
| | 25 | ఆ | స 36.3 ఆశ్లే 16.49 |
| | 26 | సో | అ 31-18 మఘ 13.53 |
| | 27 | మం | న 25.38 పుబ్బ 10-21 |
| | 28 | బు | ద 19.44 ఉఫ 6.27 |
| | 29 | గు | ఏ 13.30 హ 2.16 చిత్త 55.45 |
| | 30 | శు | ద్వా 6-24 స్వా 44-5 |
| | 31 | శ | త్ర 1.34 ఏష్య 54-19 విశా 50-19 నృసింహజయంతి |
| 1958 సం॥ జూన్ నెల | 1 | ఆ | ○ పౌ 51.13 అనూ 47.59 |
| | 2 | సో | కృపా 47.41 జ్యే 46.11 |
| | 3 | మం | విది 44.18 మూ 44-33 |
| | 4 | బు | తది 42.20 పూషా 44-29 |
| | 5 | గు | చవి 41.45 ఉషా 45-42 |
| | 6 | శు | పం 42-17 శ్ర 47.57 |
| | 7 | శ | ష 44.13 ధని 51.36 |
| | 8 | ఆ | స 47.11 శత 56-13 |
| | 9 | సో | అ 51-16 పూభా 60-0 |
| | 10 | మం | న 55.56 పూభా 2-2 |
| | 11 | బు | ద 60.0 ఉభా 8.26 |
| | 12 | గు | ద 1-3 రే 14-43 త్యాజ్యాభావః |
| | 13 | శు | ఏ 6-1 అశ్వ 21-17 |
| | 14 | శ | ద్వా 10.26 భర 27.9 కూర్మజయంతి |
| | 15 | ఆ | త్ర 14.52 కృ 32-45 మాసశివరాత్రి |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1 – 25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము. అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3 – 10  6 ఔ॥ రు. 5 – 50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయ వ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3 – 0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింత కారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటించక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2 – 0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4 – 0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు–14.

ఆంధ్ర ప్రదేశ్ కు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు.

